# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. NL. 18
స్థాపితం: 1930
సంపుటి: 57 సంచిక: 7
14-2-1986
శుక్రవారం
14 పేజీలు: రూపాయి




రామకృష్ణ హెగ్డే రాజీనామాకు కంటతడి పెడుతున్న కొందరు కర్నాటక జనతా శాసనసభ్యులు

ఇద్దరి మధ్య ఇంతే తేడా!

## హెగ్డేకు పదవి తృణప్రాయం- మరి మన రామారావుకో?

రాజకీయాలలో పదవిని తృణప్రాయంగా ఎంచగలిగితే వ్యక్తి కీర్తి ఎంతగా ఎవరెస్టు శిఖరోన్నతమవుతుందో, తనకు తనపార్టీకి నైతికంగా ఎంత సింహబలాన్ని చేకూరుస్తుందోననడానికి తాజా తార్కాణం కర్నాటక ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణ హెగ్డే రాజీనామా!

హెగ్డే నీతినిజాయితీలకు ప్రతీక అని, ఒడిదుడుకులులేని పెద్దమనిషి అని పేరుంది; కర్నాటక ప్రజలలో మంచి పట్టు వుంది. అందువల్లనే అతను ప్రజాహిత జీవనంలో వున్నతప్రమాణాలమీద గట్టిగా నిలబడగలుగుతున్నారు; విజయుడు కాగలుగుతున్నారు. హెగ్డే ముఖ్యమంత్రిత్వానికి రాజీనామా ఇవ్వడం ఇది రెండవసారి.



రామకృష్ణ హెగ్డే

పార్లమెంటు ఎన్నికలలో కర్నాటకలో అధికారంలోవున్న తన జనతాపార్టీ ఓడిపోయింది; కాంగ్రెస్‌కు అఖండ విజయం చేకూరింది. ఆ ఓటమి తన ప్రభుత్వంమీద అవిశ్వాసంగా భావించి, శాసనసభను రద్దుచేసి, తిరిగి ప్రజల ముందు నిలబడ్డాడు; ఇనుమడించిన బలంతో అజేయుడనిపించుకున్నాడు. ఇప్పుడు హైకోర్టు తన ప్రభుత్వ నిర్ణయాలలో ఒకదాన్ని ఆక్షేపిస్తూ తీర్పు ఇచ్చింది; దానికి నైతిక బాధ్యత తనదేనంటూ హెగ్డే రాజీనామా సమర్పించాడు. వాస్తవంగా హైకోర్టు ఆక్షేపించిన దానికి తనకు సంబంధమేలేదు; పైగా హైకోర్టు తనమగూర్చి పల్లెత్తుమాట అనలేదు; అందులో అవినీతి కుంభకోణా ఉన్నదని కూడా వ్యాఖ్యానించలేదు. ఒక

—కొరవ 8 ఁ పేజీలో





# పినాకిని తీరం

## జి. ప. ఛైర్మెన్ పదవి 'మ్యూజికల్ ఛేర్' అయింది!

నెల్లూరు జిల్లాపరిషత్తు ఛేర్మెన్ పదవి చివరకు "మ్యూజికల్ ఛేర్"గా తయారై పోయింది. డాక్టర్ బాలచెన్నయ్యను తొలగించి, ఆ కుర్చీలో ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డిగారిని కూర్చొ పెట్టింది ప్రభుత్వం. బాలచెన్నయ్య కోర్టు సహాయంతో ఆ కుర్చీని తన స్వాధీనం చేసుకున్నాడు; మరలా శ్రీనివాసులురెడ్డి ఆ కోర్టు సాయంతోనే బాలచెన్నయ్యను తొలగించి ఆ ఛేర్‌ను తనవశం చేసుకున్నాడు. మూన్నాళ్ళ ముచ్చటగా నగుబాట్లపాలై పోయింది ప్రతిష్ఠాకరమైన ఆ పదవి.

వ్యవహారంకోర్టులోవుంది. దీని మంచి చెడ్డలనుగూర్చి వ్యాఖ్యానించలేము.

## నాయుడుగారూ కాస్త తగ్గండి!

తగ్గమనడమంటే వుపన్యాసాల జోరు తగ్గించమనికాదు; చురకల పదును తగ్గించమనకాదు; కాస్త లావు తగ్గమని, అంతవరకే! మొన్న పత్రికలో బొమ్మచూస్తే వెంకయ్యనాయుడుగారేనా అనిపించింది: అందువల్ల ఈమాట. సలహా చెప్పడానికి నేను డాక్టర్ను కాదనుకోండి, అయినా లావు కావడం మంచిదికాదని చెప్తుంటే వింటుంటాంగదా!

అది సరేగాని నాయుడుగారూ! ఆ ఉదయగిరి వ్యవహారమేమిటి? ఏం బాగుంది? పలుకుబడి పెరిగేది పనులు చేయడంలో. రాళ్ళు వేయించడంలోకాదు, పనులు చేయించడంలో మీరు అసమానులు. అటువంటప్పుడు ఈ అడ్డదారి అవసరం ఏమి కలిగింది?

## గునుపాటికి దిష్టితగిలింది!

వ్యవసాయ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ ప్రశంసలందుకున్న పైరంటూ శ్రీ గునుపాటి రామచంద్రారెడ్డిగారి 9672-96 ను గూర్చి ప్రశంసలు కురిపించాము. వైస్‌ఛాన్సలర్ అంతటివాడు తానిటువంటిపైరు చూడలేదనిచెప్తే, చూచి సంతోషపడదామని నేనూపోయి చూచి వచ్చాను. డాక్టర్ అప్పారావుగారు చెప్పింది అతిశయోక్తి కాదనిపించింది. రామచంద్రారెడ్డిగారిచేత ఫోటోలకు ఖర్చుపెట్టించి, బ్లాకులు-చోటు వ్యయానికి మేమూ గురియై పైరు-పంట కన్నుల పండుపుగావున్నాయని ప్రకటించాము.

రామచంద్రారెడ్డిగారు ఆపైరుకోశారు: వర్షం తగులుకొన్నది. శ్రేష్ఠమైన విత్తనం క్రింద మంచి లాభాలు చేకూర్చిపెట్టవలసింది. చెడిపోయి అసలుకే మోసం వచ్చింది. దిష్టిదోషం అంటుంటారే, ఇటువంటిదేనా? అదోషం దృష్టిదిఅవునో కాదోగాని, అప్పారావుగారిది-నాది-ఆపైరుచూచి శ్రమిసిన నావంటివారందరిదీ అని చెప్పాలి చిన్నవారైతే చితికిపోవలసింది: గునుపాటి అన్నివిధాల గట్టివారు కాబట్టి అకతైనా సామ్ముచేసుకొని గట్టునపడి నాతనుకోండి!

నాకనిపిస్తుంది— ఈజనవరి ఆకాల వర్షం మినగల్లు మిల్లుకు రాత్రింబవల్లు పనికల్పించడానికి: సామంతుల, జక్కా అదృష్టంకొద్దీ వచ్చిందాఅని? మినగల్లులో నిర్మాణమైన పెద్ద బాయిల్డు రైస్‌మిల్లు ఈసంవత్సరమే పనిచేయడం మొదలు పెట్టింది. తడిసిన ధాన్యం లేకుంటే దానికి తీరికలేనిపని ఎట్లావస్తుంది? యజమానులకు లాభాలెట్లా చేకూరుతాయి చెప్పండి?

## బషీర్ రాజీనామాకు అసలు కారణం?

నెల్లూరు టవున్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ బషీర్ అహమ్మద్ తన పదవికి రాజీనామా ఇచ్చాడట. విచారకరమైన విషయం ఇది.

ఎందుకంటారా? మైనారిటీ వర్గీయుడు కావటంవల్లనేకాదు; తన తండ్రి హయాం నుండి మార్పులేకుండా కాంగ్రెస్ వాదిగానే వుంటున్నాడు కాబట్టి. అటువంటి వ్యక్తి కాంగ్రెస్‌లోని ఒక చిన్న పదవికి రాజీనామా ఇవ్వవలసిరావడం విచారకరమనే నాఅభిప్రాయం. నేనుస్వయంగా చూచాను— బషీర్ తండ్రిగారు ప్రతిఎన్నికలో పోలింగురోజు దుప్పూరులో కూర్చొని కాంగ్రెస్‌కు ఓట్లువేయించేవారు బషీర్ నెల్లూరులో ఎప్పుడూ కాంగ్రెస్ అభిమానే. ఈయనకూడా ఆనంవారి అనుచరుడే; కాని ఇతరులవలె ప్రొద్దుతిరుగుడు పువ్వు కాలేకపోయాడు, వ్యక్తిత్వాన్ని కోల్పోలేకపోయాడు; అటువంటి వ్యక్తి టవున్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా కొనసాగడం సంస్థకు నైతికంగానైనా బలంకాదా?

అనారోగ్యమే తనరాజీనామాకు కారణమని బషీర్ తనలేఖలో వెలిబుచ్చాడట; సౌమ్యుడు, పెద్దమనిషి; మరోవిధంగా ఎట్లావ్రాస్తాడు? బషీర్ ఆరోగ్యవంతుడు కానిమాట నిజమే; కాని పట్టణ కాంగ్రెస్ అధ్యక్షుడుగా నియమితుడైన ఈ రెండు మూడు నెలల్లో కొత్తగా ఆరోగ్యమేమీ చెడిపోలేదు; అది పైకి కనుబరచిన సాకు మాత్రమే.

జిల్లాకాంగ్రెస్ అధ్యక్షునిచేత అవమానితుడ్నయ్యాననేభావం కల్గినందువల్లనే ఖిన్నుడై బషీర్ రాజీనామా చేసినట్లున్నాడు. గాంధీజయంతిరోజు హరిజన గిరిజన కాంగ్రెస్ నాయకులు ప్రభుత్వ విధానానికి నిరసనగా ప్రాయోపవేశం చేశారట. టవున్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా బషీర్ ఆ కార్యక్రమంతో సహకరించాడట. ఆనేరానికి బషీర్‌ను తాను సంజాయిషి అడిగివుంటే అదొకరకం; కాని వ్యక్తిగత అనుచరులొకరిచేత తన "అసంతృప్తి, అసమ్మతు"లను సుబ్బారెడ్డిగారు తెలియజేశాడట. గాంధీజయంతినాటి హరిజన గిరిజన కార్యక్రమంలో భాగస్తుడు కావడం పట్టణ కాంగ్రెస్ అధ్యక్షుడుగా తనబాధ్యత అనుకున్నాడు బషీర్; అందులో జి. కాం. అధ్యక్షుని వైఖరి అసమంజసము, ఆక్షేపణీయము అనుకున్నాడు; అదిగొప్ప పదవేమీకాదని తెలిసినవాడుకాబట్టి రాజీనామా గోకిపారేశాడు! ఇదీ అసలుసంగతి!!

అసలు అటువంటి కార్యక్రమాలలో జి. కాం. అధ్యక్షుడుగా శ్రీ సుబ్బారెడ్డి తానే సహకరించివుండాలి: పొరపాటును కొనివుండాలి. అదిలేకపోగా సహకరించిన వారిని చిన్నబుచ్చడం ఏం భావ్యం? జి. కాం. అధ్యక్షతనేది అధికారపదవి కాదు; వ్యక్తిగతమైనదీకాదు, తాను కాంగ్రెస్ కార్యకర్తలకుదూరమైతే, కాంగ్రెస్ కార్యకర్తలు తనకు దూరమవుతారు. ఈ సూక్ష్మాన్ని సుబ్బారెడ్డిగారు గ్రహించి వ్యవహరించగలగాలి. జరిగిందేదో జరిగిపోయింది; సుబ్బారెడ్డిగారు ఇప్పుడైనా బషీర్‌చేత రాజీనామా వుపసంహరింపచేయడం బాగుంటుంది.

ఎందువల్లనో జిల్లాలోని కాంగ్రెస్ వాదులలో నైరాశ్యం, నిరుత్సాహం, నిర్లిప్తత కొట్టవచ్చినట్టు కనపడుతున్నాయి!

## క్రాంతిపథకమా— కట్టికొరివా?

ముఖ్యమంత్రి రామారావుగారు ప్రజలను మరీ'ఫూల్స్'ను చేసేస్తున్నారు; పిచ్చివాళ్ళను చేసి ఆడిస్తున్నారు; పగటివేషాలువేసి పచ్చిగా మోసం చేస్తున్నాడు! అయినా ప్రజలు ఆ సినిమా భ్రమనుండి బయట పడలేమి, ఖర్మ?

తెలుగు గ్రామీణ క్రాంతి పథకమట; పత్రికల్లో పెద్ద ప్రకటనలు. క్రాంతి పథకమా, కట్టికొరివా? పూర్వ గ్రామదానంతో, ప్రజల అర్ధ విరాళంతో అమలు జరుగుతుండిన కార్యక్రమానికి ఈయన కొత్త పేరుపెట్టి ప్రజలను వంచిస్తున్నాడు! పేరు తప్ప, రామారావు ప్రవేశపెడుతున్న ప్రతి పథకమూ పాతదే!

ప్రజలారా! కాస్త కళ్ళుతెరచి వెనక్కు చూడండి; నిజం మీకే తెలుస్తుంది!

## మెడికల్ అసోసియేషన్‌కు ఒక సూచన

ఏ రంగంలోకాని. ఏసంస్థలోకాని

—కొరప 12 వ పేజీలో

# జమీన్‌రైతు

## దుస్సాంప్రదాయం

హైదరాబాదు నగర పాలక సంఘానికి చాలకాలంతర్వాత ఎన్నికలు జరగబోతున్నాయి. 15 తేది పోలింగ్; 16 తేది సాయం త్రానికల్లా ఫలితాలు తెలిసిపోతాయి.

కార్పొరేషనులో వందమంది కౌన్సిలర్లు వుంటారు. కాంగ్రెస్, తెలుగుదేశం, బి.జె.పి., మజ్లిస్ ప్రధాన పోటీదార్లు. ప్రకటన తర్వాత ఫలితాల స్వరూపం ఎట్లా వుంటుందో వూహించలేముకాని, పరిశీలకులు మాత్రం ఏ ఒక్కపార్టీకి మెజారిటీ రాదని చెప్తున్నారు.

చివరకు ఫలితం ఎట్లా వుండబోతుందోకాని, తెలుగుదేశం కార్పొరేషనను హస్తగతం చేసుకోడానికి సర్వస్వం వొడ్డి చావు బ్రతుకుల పోరాటం సాగిస్తున్నది. అధికారాన్ని దుర్వినియోగం చేయడమేకాదు, డబ్బునుకూడా లెక్కలేకుండా కుమ్మరిస్తున్నదనే ఆరోపణలు వినబడుతున్నాయి. ప్రతి చిన్న ఎన్నికను ముఖ్యమంత్రి రామారావుగారు తన వ్యక్తిగత ప్రతిష్ఠాకర సమస్యగా తీసుకుంటారు. ఇప్పుడు కార్పొరేషన ఎన్నికలో తన పరువు, తన ప్రభుత్వ పరువు ముడిపడివున్నవని ఆయన భావిస్తున్నట్లున్నాడు. అందువల్లనే అన్ని వనరులను, అన్నిశక్తులను అక్కడ కేంద్రీకరిస్తున్నాడు.

హైదరాబాదు కార్పొరేషన ఎన్నికలకు అన్ని జిల్లాలనుండి పార్టీ కార్యకర్తలను సమీకరిస్తున్నారు. రాజధానిలో ఎవరికి ఎవరితో ఏవిధమైన బంధుత్వమున్నా, స్నేహితమున్నా హైదరాబాదుకు వచ్చి మకాంవేసి వారిచేత తెలుగుదేశం అభ్యర్థులకు వోటుచేయించవలసిందిగా ఆదేశించారట. అంతేకాదు కార్యకర్తలుగా, అవసరమైతే, వీలున్నచోట ఇతర పవిత్ర కార్యనిర్వహణ చేయవలసివస్తే అందుకు వుపయోగపెట్టుకొనుటకు కాబోలు వేలకొలది పార్టీ అభిమానులను హైదరాబాదు చేరుకోవలసిందిగా హుకుం జారీచేశారట. మంత్రులు, శాసనసభ్యులకు వార్డులు, బాధ్యతల పంపకంజరిగి వారంతా కర్తవ్య నిర్వహణలో నిమగ్నులైవున్న విషయం పాఠకులకుతెలుసు. ఆఖరుకు అమాత్యవర్యులు సైకిల్ ర్యాలీలలోకూడా పాల్గొంటున్నారు. మహానాడు సమయంలో నడివీధుల్లో వొళ్ళుమరచి చిందులేసిన మంత్రులకు సైకిళ్ళమీద వూరేగడం పెద్దవిషయంకాదు. ఒక్కమాటలో చెప్పాలంటే శాసనసభ ఎన్నికలవలెనే నగరపాలక ఎన్నికలలోకూడా తెలుగుదేశం తన సర్వశక్తులు, యుక్తులు ప్రయోగిస్తున్నది.

ముఖ్యమంత్రి అంతటివాడు మునిసిపల్ ఎన్నికలో చైతన్య రథారూఢుడై ప్రొద్దుపొడవకముందే ప్రచారానికి బయలుదేరాడట, వేషం మార్చాడట, భాషమార్చాడట, ముస్లింటోపీ పెట్టుకున్నాడట, ఏఎండకాగొడుగుపడుతూ, ఏగాలికాచాప ఎత్తుతూ, ఏరోటివద్దఆపాట పాడుతున్నాడట. ఒక చిన్న ఎన్నికలో ముఖ్యమంత్రి అంతటివాడు అధికార అసరాతో పగటివేషాలువేసి కడకు ప్రజలకు టోపీపెట్టడానికి తయారైవాడంటే దేశ దౌర్భాగ్యం అనుకోవలసివస్తున్నది.

అధికారంలో వున్నవారు కొన్ని సాంప్రదాయాలను పాటించాలి. అసలు స్థానికసంస్థల ఎన్నికలలో పార్టీల ప్రసక్తి రాకూడదు; పార్టీ అభ్యర్థులుండకూడదు. రాజకీయాలకు అతీతంగా తమకు సేవ చేయగలిగిన వ్యక్తిని ఎన్నుకొనే స్వేచ్ఛను పౌరులకు ఇవ్వాలి. పంచాయతీరాజ్ ఎన్నికలకు సంబంధించి కాంగ్రెస్ ముఖ్యమంత్రిగా అంజయ్య ఆ సత్సాంప్రదాయాన్ని పాటించాడు. ఆమాత్రం నీతిని కూడా ఆదర్శాలు వల్లించే రామారావుగారు అనుసరించలేకపోతున్నారు; ఒక దుస్సాంప్రదాయాన్ని ప్రవేశపెడుతున్నారు; తద్వారా నగరపాలక ఎన్నికలలో ప్రతిబింబించవలసిన స్వేచ్ఛను హరిస్తున్నాడు. కాంగ్రెస్ తదితరపార్టీలు తమ అభ్యర్థులను నిలిపి, వారికి ఆ పార్టీల నాయకులు ప్రచారంచేయడంలేదా అంటే చేస్తున్నారు; కాని ఆపార్టీలేవీ అధికారంలోలేవు; అధికారంలోవుండి చేస్తే తప్పు. రామారావుగారు చెప్పేవన్నీ శ్రీరంగనీతులనడానికి కార్పొరేషన ఎన్నికలలో ఆయనపాత్రే ప్రత్యక్ష తార్కాణం!

---

# జమీన్‌రైతు

14-2-1936

### నమ్ము నమ్మకపో

1934 సంవత్సరములో మేవెస్టు అనే సినిమానటికి పేరమౌంటు ఫిలిం కంపెనీవారు 62,000 పౌనులు జీతంక్రింద యిచ్చారట.

* * *

రాబోయే సంస్కరణలప్రకారం 100 కి 14 మందికి మాత్రమే ఓటింగుహక్కు ఇవ్వబడింది.

* * *

అబిసీనియా చక్రవర్తి సింహాసనమును మోహన్లాల్ పానచంద్‌యను భారతీయుడు 10 నెలలలో చేసెను.

దొంగగాని, అల్మారాగాని వుపయోగపడు మరొక వస్తువుకూడా చేసెను.

### యుద్ధజ్వాలలు

అబిసీనియా చక్రవర్తిని చంపవలయునను వుద్దేశముతో 9 తేదిన ఇటలీ విమానములు డెస్సీనగరమును ముట్టడించి, ఇండ్లపై కొన్ని అడుగుల ఎత్తునుండి ఒక గంటకాలం బాంబుల వర్షం కురిపింపబడెను. చక్రవర్తియున్న భవనముపై ఎన్నియో బాంబులు వేయబడెను. కాని చక్రవర్తిగారు భద్రమయిన ప్రదేశమునకువెళ్ళి తలదాచుకొనక సైనికులతోచేరి విమానాలపై తుపాకులను కాల్చుచుండిరి; చక్రవర్తిగారికి మేమియు అపాయము కలుగలేదు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

### విధవా వివాహముల బిల్లు

భార్య కోల్పోయినవారు కన్యలను పెండ్లాడరాదు, విధవలనే పెండ్లాడవలెనను, బిల్లును అసెంబ్లీలో సేవనలిస్టు సభ్యులగు సూర్యకుమార సేనగారు తీసుకొని వచ్చెదరని తెలియుచున్నది.

### జపానులో ఫ్యాక్టరీలు

జపానులో 1928 లో నున్న 5594 ఫ్యాక్టరీలలో 100 కి 50 వంతులు పైగా 5 మొదలు 9 మంది పనివారలతో మాత్రమే నడుచుచుండును. సుమారు వెయ్యిమంది కార్మికులు కలిగిన పారిశ్రామిక సంస్థలు 100 కి 5 మాత్రమేగలవు.

---

# కాళ్లకు మ్రొక్కడం ప్రజాస్వామ్యమా

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు కాళ్ళకు కార్యకర్తలు దండాలు పెట్టి, మట్టిని నెత్తిన చల్లుకోవడాన్ని, విద్యామంత్రి శ్రీ ముద్దుకృష్ణమనాయుడు సమర్థించడం సిగ్గుచేటుగావుంది! ఆప్యాయతను, భక్తిని ప్రదర్శించడానికి సాష్టాంగ దండప్రమాణాలు చేయవచ్చునని ఆయన వివరణచెప్తుంటే - ఎంత దిగజారిపోయాయి రాజకీయాలు అనిపిస్తూంది.

హిందూమత సాంప్రదాయం ప్రకారం భగవంతుడికి, భగవత్స్వరూపులైన పుణ్యపురుషులకు సాష్టాంగ నమస్కారం చేయడం తప్పుకాదు. అయితే ఎన్ టి ఆర్ సాధారణ రాజకీయ నాయకుడు; స్వార్థం, పదవీకాంక్ష, బంధుప్రీతి, వంటి అష్టాదశ అవలక్షణాలు మూర్తీభవించిన సగటు మానవుడు. అధికారంలో వుండడంతప్ప, ఆయనకున్న అదనపు అర్హతలు శూన్యం: అధికారంకోసమే, అనుగ్రహం కోసమే తప్ప, ఏ కార్యకర్తా భక్తితో ఆయనకు పాదపూజలు చేయడంలేదు. ఆయన మెచ్చితే, పదవి వస్తుందనేది వీరి ఆశ.

ప్రజాస్వామ్యంలో, ప్రభుత్వ అధినేతలు ప్రజలకు సేవకులుగా, ప్రతినిధులుగావుండాలి. అంతేతప్ప, ప్రజలు తనకు భృత్యులనే అహంకారులకు, ప్రజాస్వామ్యంలో స్థానంలేదు: ఇటువంటివారిని సమర్థించేవారిని మూర్ఖులనక మరేమనాలి?

-మన్నెముత్తుల సుబ్బరామరెడ్డి, లేబూరు

## చెస్ పోటీలు

మా క్లబ్ ఆధ్వర్యంలో ఫిబ్రవరి 21 నుంచి వరుసగా మూడురోజులపాటు చెస్ పోటీలు నిర్వహించ తలపెట్టాము. ట్రంకురోడ్డు, జలగం వెంగళరావు భవనంలో ఈ పోటీలు జరుగుతాయి. పోటీలలో పాల్గొనదలచినవారు 10 రూపాయల ప్రవేశరుసుము జతపర్చి సింహపురి చెస్ క్లబ్, శ్రీ నివాస కంట్రీవుడ్ డిపో, గాయత్రినగర్, నెల్లూరు-4 అన్న చిరునామాకు దరఖాస్తుచేయాలి.

నెల్లూరు -ఎ. వి. ప్రసాద్ కార్యదర్శి

## రాజవీధా? రాచపుండ్లవీధా?

నెల్లూరుటౌనులో రోడ్లపరిస్థితి పరమ ముఃనష్టంగావున్న సంగతి ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. కానీ అనలేమీ పట్టించుకోని మునిసిపాలిటీ, మనకెట్లా దాపురించిందో, ఖర్మ.

రాజవీధి పేరుకే; ఆరాజసం ఎక్కడా

### జనవాణి

కనిపించదు. రాచపుండ్లవంటి గుంటలు, గతుకులు. ఒక్కసారి రోడ్డుపాడుగునా సైకిల్‌లోనో, రిక్షాలోనో ప్రయాణిస్తే తెలుస్తుంది, ఆ నరకం. ఈమధ్య రైకస్ రోడ్డు పెద్దబజారువంటిచోట్ల, ప్యాచింగ్ వర్క్‌చేశారు. ఆ మాత్రానికికూడా ఈ రాయాజీవీధి నోచుకోలేదా? కమీషనర్ గారూ-గుంటలు పూడ్చించైనా మమ్మల్ని కనికరించండి.

నెల్లూరు -డి. జనార్దన్.

## తడికల బజారు లారీల తంటా

స్టోనుహౌస్‌పేట, తడికల బజారులలో లారీల రాకపోకలు పెద్ద తంటాగా పరిణమిస్తున్నాయి. వీటికి వేళాపాళా లేదు. రోడ్డులో తామేకాక ఇంకా ఇతరత్రావాహనాలు పోవలసివుంటుందన్న ధ్యాసాలేదు. లారీలుతెచ్చి రోడ్డుకు రెండుప్రక్కలా బారుబార్లుగా నిలబెడ్తారు. సైకిల్ పోవాలన్నా చాలినంత సందుండదు. తడికల

—కొరవ 12వ పేజీలో

# మడమనూరు మరొక చవటపాళెం కానున్నదా?

మడమనూరు మరొక చవటపాళెం కానున్నదా? కక్షలు కార్పణ్యాలతో, కసాయితనం పెంచుకుని కావేశాలు కాలేతుందా? వర్గ విరోధాల దావాగ్నిలో దగ్ధమైపోతుందా?

గ్రామకక్షలులేని నెల్లూరు జిల్లా, మొత్తం గాలించినా కన్పడదు; అయితే ఈ విభేదాలు వ్యక్తిగత ద్వేషాలుగా పరిణతి చెందడం, రక్తపాతం సృష్టించుకొని కుటుంబాలకు కుటుంబాలే అహుతి

## హత్య

కావడం కొన్ని గ్రామాలలోనే కలుస్తుంది. మన జిల్లాలో గ్రామకక్షలకు దర్పణం వంటిది, చవటపాళెం, ఏళ్ళ తరబడి సమీప బంధువులే శత్రువులవలె మారి, ఒకరొకరు చంపుకొని, జైళ్ళపాలై తమ జీవితాలనేకాక, పెళ్ళాంపిల్లల బ్రతుకులుకూడా బుగ్గిపాలు చేసుకన్నారు. దాదాపు ఇరవై కుటుంబాలు దిక్కులేనివైన తర్వాతగాని, వారి కళ్ళు తెరిపినపడలేదు; వారి గ్రామానికి శాంతి కలుగలేదు.

ఒకవైపు ఈ దారుణ అనుభవాలు కళ్ళారాచూస్తూనే ఇంకొకవ్యక్తి మరికొన్ని గ్రామాలలో కొత్తగా కక్షలు రాజుకోవడం చూస్తుంటే, మన, గ్రామ పెద్దలు కళ్ళుండీ గ్రుడ్డివారౌతున్నారా అని జాలి కలుగుతుంది. గ్రామకక్షలకు శత్రునిర్మూలనే తరుణోపాయమనే మూర్ఖులను ఎవరు మార్చగలరు; ఎవరు సంస్కరించగలరు?

నెల్లూరుతాలూకా మడమనూరు గ్రామంలో ఇటీవలకాలంలో వర్గకక్షలు తీవ్రరూపం దాలుస్తున్నాయి. రెండువర్షాలక్రితమే ఈ గ్రామంలో విభేదాల విత్తుపడింది. అనిప్పు రాజుకొని, రాజుకొని జన్మేళ్ళతర్వాత భగ్గున మండుతూంది. 7 తేది రాత్రి మందా వెంకురెడ్డి అనే రైతును, గ్రామస్తులే దారికాచి, దారుణంగా కొట్టిచంపారట. రాత్రి 9-30 గంటల సమయంలో చెరువుకట్ట మీద జరిగింది ఘోరం.

వెంకురెడ్డి, వజ్జా సుబ్బారెడ్డి అనే స్నేహితుడితోకలసి నెల్లూరునుంచి మనుబోలుకు లారీలోవచ్చి, అక్కడనుంచి ఊరికి నడిచివస్తుండినారట. చెరువుకట్ట ఎక్కేసరికి, ఇద్దరువ్యక్తులు కర్రలతో, ఎదురొచ్చి నిలవేశారట. పరిస్థితి గమ

—కొరవ 8వ పేజీలో





# వెంకటగిరిలో రెండు ఆస్పత్రులుండీ దండగే!

వెంకటగిరిలోని రెండు ప్రభుత్వ ఆస్పత్రులూ, అవకతవకల నిలయాలుగా మారుతున్నాయి; అలంకరణ తార్కాణంగా మిగులుతున్నాయి.

టౌనులోవుండే ఆస్పత్రిలో ముగ్గురూ మగ డాక్టర్లే! స్త్రీలు పరీక్షించుకోవడానికి చాలా కష్టంగావుంది. ఒక్క లేడీ డాక్టర్‌ను నియమించాలన్న ప్రజల కోరికను, అధికారులు దశాబ్దాలనుంచి చెవిన పెడుతున్నారు. ఊరికి దూరంగా, రెండు కిలోమీటర్ల అవతలవుండే ఘోషా ఆస్పత్రి కాన్పులకే పరిమితమైపోయినట్టుంది.

ఈ రెండు ఆస్పత్రులలో ఏ సౌకర్యాలూ లేవు. ఆపరేషను థియేటర్లు లేవు; ఎక్స్‌రే ప్లాంటులేదు; ఆఖరకు రక్త, మల మూత్రాదుల పరీక్షకుకూడా పరికరాలులేవు; మందులసలేలేవు; అన్నిటికీ మించి పరిశుభ్రత అన్నమాటకే రెండింటిలో చోటులేదు. జ్వరాలు, జలుబులు తప్ప, ఏ కొంచెం పెద్ద జబ్బు వచ్చినా, డాక్టర్లు రోగులను అటు తిరుపతికి, ఇటు నెల్లూరుకు పంపుతారు.

అమధ్య, గోగినేనిపురం తెలుగుదేశం శిక్షణా శిబిరానికి వచ్చిన ఆరోగ్య మంత్రికి వీటి దుస్థితి చెప్తే, ఎమ్మెల్యే వెళ్ళి పరిస్థితులు పరిశీలించి, నివేదిక సమర్పిస్తే, తాను బాగుచేస్తానని హామీ ఇచ్చారు. మంత్రిగారు మాటఇచ్చి ఆరు నెలలు, ఎమ్మెల్యే నివేదిక సిద్ధంచేసి నాలుగునెలలు గడచిపోయాయి; పరిస్థితులుమాత్రం అవే. ఏమార్పూ లేదు.

ఎమ్మెల్యేగారు నివేదిక ఇచ్చి చేతులు దులుపుకోవడం కాకుండా, గట్టిగా కృషి చేస్తే, ఆస్పత్రులు బాగుపడవా?

### ఎరువుల వ్యాపారిపై దాడి, అరెస్టు

వెంకటగిరి టౌనులోని ఈశ్వరయ్య ఎరువుల అంగడిపై విజిలెన్సు అధికారులు దాడిచేసి, బ్లాక్ రేట్లలో ఎరువులమ్ముతున్నందుకు యజమానులలో ఒకరైన దశరథయ్యను అరెస్టు చేశారు; మరొక భాగస్తుడు పరారీలో వున్నాడట. సర్కిల్ ఇన్స్‌పెక్టర్ శ్రీ వి. సుబ్బారెడ్డి ఈ దాడులు నిర్వహించారు.

### సూళ్ళూరుపేట రామభక్తులు

సూళ్ళూరుపేటలోని శ్రీరామ జన్మభూమి విముక్తి యజ్ఞసమితి సభ్యులు 9 తేది టౌనులో ఊరేగింపు జరిపారు; తర్వాత చిత్రకూటంవద్ద సభ: విశ్వహిందూపరిషత్ అధ్యక్షులు శ్రీ అయితా పాండురంగగుప్త అధ్యక్షించారు: వి. రామకృష్ణమాచార్యులు, టి. శివరామకృష్ణయ్య, వి. సోమనాథశాస్త్రి, శ్రీరామ జన్మభూమి విముక్తి ఉద్యమాన్ని వివరించారు. శ్రీ కాళహస్తి సుబ్రహ్మణ్యం వందనాలు చెప్పారు.

### కావలి కాంట్రాక్టుల ఫిర్యాదు

కావలి టౌనులోని వాయునందన పెన్‌రోడ్డు, సినిమాహాళ్ళ వీధులకు తారురోడ్లు వేస్తున్నారట; అయితే ఇందుకు కాంట్రాక్టర్లువాడే కంకర, పనికిమాలినదిగావుందని, పోలిన కంకర గుట్టలలో సగభాగం కొలతల తర్వాత రాత్రికిరాత్రి మాయం చేశారని, కావలి బి జె పి అధ్యక్షుడు శ్రీ దొన్నూరు వెంకటేశ్వరరావు ఫిర్యాదు చేస్తున్నారు. 4 వార్డులో ఒక మురికికాలువ విషయంలోకూడా ఇట్లే జరిగిందని కమీషనరుకు చెప్తే అయన పట్టించుకోకుండా, కాంట్రాక్టర్లకు బిల్లులు కూడా ఇచ్చేశాడట. పురపాలక మంత్రి అయినా ఈ అక్రమాలు నివారించాలని అయన కోరిక.

### అల్లూరు చెరువుకు నీళ్లు

కనిగిరి చెరువులో జనవరి వర్షాలవల్ల పుష్కలంగా నీళ్ళున్నాయి; నీళ్ళు రాక

### కావలి గ్రిగ్ క్రీడలు

కావలి జోన్ గ్రిగ్ పోటీలు కావలి జి హ హైస్కూలులో జరిగాయి. మునిసిపల్ కమిషనర్ శ్రీ వి జి వి ప్రసాద్ ప్రారంభోత్సవ సభను అధ్యక్షించారు; డి ఎస్ పి శ్రీ ఉమాపతి ప్రారంభించారు. ముగింపు సమావేశాన్ని శ్రీ పి. విరాంజనేయులు అధ్యక్షించారు.

స్పోర్ట్సు, గేమ్సు రెండిటిలో బిట్రగుంట జి స హైస్కూలు విద్యార్థులు ఛాంపియన్లుగా గెలాచ్రు. ఆల్‌రౌండ్ ఛాంపియన్‌షిప్‌కూడా వారిదే! వ్యక్తిగత ఛాంపి

## ** జిల్లావార్తలు **

ముందు, ఈ ఏడాది అల్లూరు చెరువు క్రింద 6 వేల ఎకరాలకే రెండవపంటకు నీళ్ళివ్వాలని నిర్ణయించారట; అయితే ఇప్పుడు పూర్తిగా నీళ్ళున్నాయి కాబట్టి, మొత్తం ఆయకట్టుకు నీళ్ళివ్వాలని, అల్లూరు చెరువు రైతులు కోరుతున్నారు.

### కోడూరు సన్మానం

ఇందుకూరుపేట సమితి రిటైర్డ్ విద్యా విస్తరణాధికారి శ్రీ కె. వి. నరసింహంను కోడూరు సెంటర్ ఉపాధ్యాయులు ఇటీవల సన్మానించారు. స్కూళ్ళ డిప్యూటీ ఇన్స్‌పెక్టర్ శ్రీ కె. ఎ. పద్మనాభం అధ్యక్షించారు. కొత్త ఎద్యుకేషన్ ఇ. ఒ. శ్రీ రాఘవులు, డి. కోటయ్య, పి. పద్మనాభరావు, కె. శామ్యూల్, ఎ.నరసింహరావు తదితరులుమాట్లాడారు.

యన్‌షిప్ సీనియర్సులో డి. చిన్నబాబు, జూనియర్సులో అబ్దుల్ రహమ్మాన్ హుసేన్ సాధించారు; వీరిద్దరుకూడా బిట్రగుంట విద్యార్థులే!

### గూడూరు ఆస్పత్రికి సత్యసాయి భక్తుల సేవ

అపరిశుభ్రతకు మారుపేరు, గూడూరు ప్రభుత్వాసుపత్రి. ఆవరణమంతా చెత్తాచెదారం. మురికిగుంటలతో గలీజుగా, గబ్బుగా వుంటుండేది. ఈ పరిస్థితిని చూసి, ఇటీవల స్థానిక సత్యసాయి సంఘం సభ్యులు తమకుతాముగా పూనుకొని, మొత్తం శుభ్రం చేశారు; లోపల కాపురాలు పెట్టివుండిన పందులు, కుక్కలను పారద్రోలారు.

—కొరవ 10వ పేజీలో

# కావలి కౌన్సిలర్ బాల్విమీద హత్యా యత్నం!

కావలి మునిసిపల్ కౌన్సిలర్ శ్రీ అరవ్ బాల్విని చంపడానికి 12 తేది అర్ధరాత్రి ఎవరో విఫలయత్నంచేశారు. రాత్రి 11.30 ప్రాంతంలో బాల్వి సైకిల్‌పై ఇంటికిపోతుండినాడట; ఉదయగిరిరోడ్డు రైల్వే గేటు దాటగానే, హఠాత్తుగా ఒక యువకుడు వెనుకనుంచివచ్చి, ఎడమ ఛాతీవైపు పొడవడానికి కత్తి ఎత్తాడట. అయితే బాల్వి అదిగమనించి ఎడమ చేతిని అడ్డం పెట్టడంతో మోచేతికి పైన మూడంగుళాలమేర కండతెగిపోయి చీరుకుపోయింది. ఇంతలో గేటుదగ్గరున్న జనం తమముకోవడంతో, హంతకుడు పారిపోయాడట. అతడి చెప్పులుమాత్రం అక్కడే రైలుకట్టపై దొరికాయట.

బాల్విని వెంటనే కావలి ఆస్పత్రికి తరలించి, తర్వాత నెల్లూరు పెద్దాస్పత్రికి తీసుకవచ్చి చికిత్స చేశారు. నరాలు తెగి చెయ్యి చచ్చు అయిపోయినందువల్ల ఈరోజు మద్రాసు తరలించారు. బాల్వికి కత్తిగాయంతో చాల ఎక్కువగా రక్తం నష్టమైందట.

బాల్వి మునిసిపల్ కౌన్సిలరేకాదు; జిల్లా గ్రంథాలయ సంస్థ సభ్యుడుకూడా. ఎం. ఎ. పట్టభద్రుడు; ఎప్పుడూ నవ్వుతూ నరదాగావుండే యువకుడు. అతను స్థానికంగా యానాదిరెడ్డి అభిమానేగాని, పార్టీ రాజకీయాలలో అంతగా తలదూర్చేవాడు కాదు; ఎవ్వరితోనూ విరోధం తెచ్చుకునేవాడుకాదు. ఇటీవల మునిసిపల్ కమిషనర్ దర్యాను మాత్రం తీవ్రంగా ప్రతిఘటిస్తుండినాడట. అది తప్ప అతను ఏ వివాదంలోకి పోయేవాడు కాదట. అతనిమీద హత్యాప్రయత్నానికి కారణమేమిటో తెలియదు. ఈ సందర్భంలో ఇంతవరకు ఎవ్వరూ అరెస్టుగావింపబడినట్లులేదు.

★

## నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

### సుప్రీంకోర్టులో జి. ప. ఛేర్మన్లు

జిల్లాపరిషత్ ఛేర్మన్ డాక్టర్ సి. హెచ్. బాలచెన్నయ్య, తన సస్పెన్షన్ ఉత్తర్వులపై హైకోర్టు తీర్పును సవాల్ చేస్తూ సుప్రీంకోర్టులో అప్పీలు దాఖలు చేసినట్లు తెలుస్తోంది.

రాష్ట్రంలోని నలుగురు జి. ప. ఛేర్మన్లను అవినీతి ఆరోపణలపై ప్రభుత్వం సస్పెండ్‌చేయడం, దానిపై రెండుసార్లు హైకోర్టు న్యాయమూర్తులు చేర్మన్లకు అనుకూలంగా తీర్పివ్వడం, తర్వాత ప్రభుత్వ అప్పీలులో హైకోర్టు డివిజన్ బెంచి సస్పెన్షన్ సక్రమమేనని తీర్పు చెప్పడం తెలిసిందే!

ఈతీర్పును బాలచెన్నయ్య, చిత్తూరు, విజయనగరం ఛేర్మన్లతోకలసి సుప్రీం కోర్టులో సవాల్‌చేయడానికి ఢిల్లీ వెళ్ళారు. అయితే వీరి రిట్‌పిటిషన్ అనుమతింపబడింది. లేనిదీ ఇంకా తెలియలేదు.

### చక్కెర ఫ్యాక్టరీ

చక్కెరంటే తీపిపదార్థం; కాని మన [illegible]కరఫ్యాక్టరీవార్తమాత్రం చేదుగానే [illegible]వలసి వస్తున్నది. మానేగారి [illegible]హాత్మ్యం మరి!

ఎం. యానాదయ్యగారని అసిస్టెంటు అగ్రికల్చర్ ఆఫీసరు; డెప్యుటేషన్‌మీద మానేగారు భీమడోలునుంచి ఆయన్ను [illegible] తనతోటి ఇక్కడకు తెచ్చుకున్నారు; అతనూ అత్యంతవివాదాస్పదుడైనాడు; అతన్నిగూర్చి చాలచాల కతలు వినబడుతున్నాయి. నెల్లూరు ఫ్యాక్టరీ అదృష్టంకొద్దీ భీమడోలు ఫ్యాక్టరీవారు సదరు యానాదయ్యగారిని తిరుగా తమకే పంపవలసిందిగా నెల్లూరు ఫ్యాక్టరీకి వ్రాశారట; మానేగారుకూడా మంచిబుద్ధి పెట్టి అతన్ని భీమడోలు ఫ్యాక్టరీకి తిరుగా పంపివేసినట్లు 10 తేది వుత్తరువులుకూడా జారీచేశారు.

ఇప్పుడు రైతులు కోరేది మానేగారి వుత్తరువు మారగూడదు అని. మారదనే ఆశిస్తాము.

### మినికిట్సు మాయం- "కోట" ముట్టడి!

వాకాడు మండలంలోని రైతులకుద్దేశించిన వేరుసెనగ, పెసర, మినుము విత్తనాల మినికిట్లు కోటలోనే మాయమైపోయాయని 11 తేది ఆ మండలం రైతులు కోటమీదికి దండెత్తి వచ్చారట; బస్ లన్నిటికీ నినాదాలువ్రాసి కట్టారట; సమితి ఆఫీసువద్ద పెద్ద రచ్చట. సమితి వ్యవసాయశాఖాధికారిమాత్రం -అయ్యా, వారేమీ తెలియదు, సమితి ప్రభువులే అంతా చూచుకున్నారు. వారినడగండి అని సమాధానం చెప్పారట.

ఈ విషయమై గూడూరు ఎ. డి. ఎ. శ్రీ వెంకటేశ్వరరావుగారికి ఫోన్‌చేసి అడుగగా వాకాడు మండలంవారికి మినికిట్లు పంపకంకానిమాట నిజమేనంటూ, దానికి కారణం వాకాడు వ్యవసాయాధికారి దరఖాస్తుఫారాలు భర్తీచేసి పంపడంలో జరిగిన ఆలస్యమని అన్నారు. రైతుల 'కోటముట్టడి'ని గూర్చి తానూ విన్నానని, అక్కడకు పోయివచ్చిన తర్వాత వివరాలుచెప్పగలనని అన్నారు.

అధికారముందిగదా అని నల్లపరెడ్డివారు విశృంఖలంగా వ్యవహరిస్తున్నట్లుంది.

### స్కానింగ్ సెంటర్

శబ్ద సహాయంతో రోగి శరీరంలో వ్యాధినిర్ణయంచేసే అత్యాధునిక వైద్య ప్రక్రియలతో కూడిన అరవింద్ అల్ట్రాసౌండ్ డయాగ్నొస్టిక్ సెంటర్‌ను 10తేది ఉదయం పొగతోటలో ప్రారంభించారు. మద్రాసులోని మెడిస్కాన్ సిస్టమ్స్ సంస్థ డైరక్టర్ డాక్టర్ రమేష్ ఈ యంత్రపరికరాలకు స్విచ్ ఆన్ చేశారు. డాక్టర్ కె. అరవిందరెడ్డి ఈ సెంటర్ స్థాపకుడు. నెల్లూరీయులకునవీనవైద్యసౌకర్యం అందజేసినందుకు ఆయనకు మాఅభినందనలు.

అరవింద్ అల్ట్రాసౌండ్ డయోగ్నొస్టిక్ సెంటర్‌కు స్విచ్‌ఆన్ చేస్తున్న డాక్టర్ రమేష్, ప్రక్కన డాక్టర్ అరవిందరెడ్డి

### ప్రభాకరనాయుడు సంగతి ?

కావలి ప్రభుత్వ ఆస్పత్రి డాక్టరుగా వుండిన ప్రభాకరనాయుడు 1985 ఎన్నికలలో తెలుగుదేశం టికెట్‌కు ఒక దరఖాస్తుదారేకాదు; ప్రస్తుతం ఆపార్టీ జిల్లా కార్యదర్శికూడా.

ఆయన పార్టీలో వుంటూ డాక్టరుగా కొనసాగుతున్నారా? వుద్యోగానికి రాజీనామా చేసివుంటే ఎప్పుడు చేశాడు? అది ఎప్పుడు ఆమోదించబడింది? మధ్యకాలంలో ఇటు డాక్టరుగా - అటు పార్టీ కార్యకర్తగా వ్యవహరించాడా? ఆ కాలానికి జీతం తీసుకున్నాడా? ఆయన రాజకీయవాదిగా- డాక్టరుగా వుంటే పై అధికార్లు వూరుకున్నారా?

ఇవన్నీ ప్రజల మనసులోవున్న సందేహాలు- ప్రశ్నలు. ఆయన జీతం తీసుకోలేదనిమాత్రం తెలిసింది. కాని ఆస్పత్రి అధికార కార్యకలాపాలన్నీ ఈ నాయకుడే తన క్లినిక్‌లో కూర్చొని నిర్వహిస్తున్నాడని, కాగితాలమీద ప్రభుత్వ డాక్టరుగా సంతకాలు పెడుతున్నాడని ఒకరు చెప్తున్నారు. దాన్ని ధృవపరచుకొని మళ్లీ చెప్తాము.

ఏమైనా ప్రభాకరనాయుడు పదఘట్టనలో కావలి ప్రజాజీవితం నలిగిపోతున్నదని, నిత్య పాలనలోని ప్రతి చిన్న విషయంలో అతని జోక్యం వుంటున్నదని అలజడిగావుంది. రాజకీయ జీవితపు ప్రాథమికదశలోవున్నవారికి మిడిసిపాటు మంచిదికాదు; అటువంటి వైఖరి భవిష్యత్తుకు భంగకరంగావుంటుంది!

### విద్యుత్ శాఖ

నెల్లూరు డి. ఇ. గా వుండిన శ్రీ బి. శ్రీరాములు ప్రమోషన్‌లో విజయవాడ ఎస్. ఇ. గా బదిలీ అయ్యారు. వారి స్థానంలో డి. ఇ. గా థర్మల్ స్టేషన్ నుండి శ్రీ కె. ప్రేమసాగర్ నియమింపబడ్డారు. వారు ఈరోజు చార్జితీసుకోవచ్చునట.

మంచిపేరుతో, ప్రమోషన్‌తో నెల్లూరును వదలిన శ్రీరాములుగారికి మా హార్దికాభినందనలు.

* * *

కాస్త పాతదే; అయినా వార్తకు పాతేమిటి కొత్తేమిటి!

బలరామరెడ్డిగారి తర్వాత చాలాకాలం ఖాళీగా వుండిన సూపరింటెండింగ్ ఇంజనీరు స్థానానికి శ్రీ ఇ. జనార్దనరెడ్డి నియమింపబడి పనిచేస్తున్నారు.

శ్రీ జనార్దనరెడ్డి సౌమ్యుడు, నిజాయితీపరుడు, స్ట్రిక్టు ఆఫీసరేకాదు; పనిలో చురుకైనవాడు.

* * *

టవున్‌లోని కొన్నిచోట్ల వోల్టేజి తక్కువగా వుంటున్నది: సరఫరా రాకపోకలు ఇష్టానుసారంగా వుంటున్నది; మావంటి పత్రికలవారికి పని భంగకరంగా, నష్టదాయకంగా వుంది. కాస్త దయపెట్టమని విద్యుత్‌శాఖకు మనవి.

### మంచిదికాదు

తల్లి తండ్రి గురువు దైవం అనే మన ధర్మాన్ని, సంస్కృతిని కాపాడవలసిన ఎలిమెంటరీ విద్యార్థులు గురువులనుదుర్భాషలాడడం, దౌర్జన్యానికి సిద్ధపడడం విచారకరం. చదువు సభ్యత సంస్కారాల నివ్వాలి; నమ్రతాశీలాన్ని పెంచాలి. వి. ఆర్. కాలేజిలో మొన్నజరిగిన ఒక సంఘటననుగూర్చివిన్నప్పుడు ఈమాటలనవలసివస్తున్నది. ఈ వైఖరి వ్యక్తిగతంగా గాని, పార్టీపరంగాగాని మంచిదికాదు.

* * *

"మనం చదువుకున్న మన వి. ఆర్. కాలేజి దుస్థితిపాలైపోతుంటే మనంచూస్తూ వూరుకోవలసిందేనా?" అని ఒకమిత్రుడు అత్యంత ఆవేదనతో ప్రశ్నించాడు. ఇటీవల పట్టపగలు క్లాసుగదుల్లో కామకళా ప్రాక్టికల్సులో నిమగ్నమైవుండిన రెండు జతల విద్యార్థినీవిద్యార్థులను పట్టుకోవడం జరిగిందని ఆమిత్రుడన్నాడు. రామరామ వందసంవత్సరాల కీర్తివంతమైన చరిత్ర గలిగిన ఈ కాలేజికి ఇంత పతనమా?

ఇంత అరాజకంగా నడిచేబదులు ఆ కాలేజి మూతబడడమో, లేక ప్రభుత్వ స్వాధీనం కావడమో మరుపుగావుండదా?

### కవిత్రయ జయంతులు

కవిత్రయ జయంతులు ఈ నెల 15, 16, 17 తేదులలో టవున్‌హాలులో జరుగుతాయి.

15 తేది నన్నయజయంతి-మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజి తెలుగు ఆచార్యుడు డాక్టర్ [illegible] చిన్నికృష్ణయ్య 'పాండురంగ మహాత్మ్యం'ను గూర్చి; 16 తేది ఎర్రన జయంతిలో శ్రీ ఎన్. ఎస్. కృష్ణమూర్తి నృసింహ పురాణము-అరణ్యపర్వ శేషాన్ని గూర్చి; 17 తేది తిక్కనజయంతిలో డాక్టర్ నందూరు రామకృష్ణమాచార్య తిక్కన కవితా వైభవాన్నిగూర్చి వుపన్యసించి తిక్కనసత్పురామరెడ్డిగారి పేర డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారినుండి సన్మానములు స్వీకరిస్తారు.

### "176" రద్దు

టెలిఫోన్ల శాఖనుంచి నెల్లూరులో సినిమాలవంటి ప్రత్యేక సమాచారం సేకరించడానికి కేటాయించిన 176 నంబరును రద్దుచేస్తున్నట్లు డి ఇ టి ప్రకటించారు. సరైన వినియోగం లేనందువల్ల ఈ సర్వీసునురద్దుచేస్తున్నారట.

-కొరవ 8వ పేజీలో

నాయుడుపేట గ్రామపంచాయతి కార్యాలయం

## వేలము ప్రకటన

ఆర్. ఓ. సి. నం. 84/86-ఎ. 12-2-1986.

నాయుడుపేట గ్రామ పంచాయతీకి చెందిన ఈ క్రింది హక్కులను ఆయా వివరముల ప్రకారం సంవత్సరమునకు 21-2-86 తేది శుక్రవారము ఉ. 10-30 గం. నుండి నాయుడుపేట గ్రామపంచాయతి కార్యాలయంలో కార్యనిర్వహణాధికారి వారిచేగాని లేదా వారి అనుమతిపొందినవారిచేగాని బహిరంగముగా వేలము వేయబడును. వేలమునందు పాల్గొనదలచినవారు ఈ క్రింద చూపినప్రకారంముగా సాల్వెన్సీ సర్టిఫికేటు మరియు ఎన్‌కంబ్రెన్స్ సర్టిఫికేటుజతచేసి దాఖలుచేసి ధరావత్తులు చెల్లించి పాటలో పాల్గొనవలయును. వేలము షరత్తులు, మిగతా వివరములు పంచాయతి కార్యాలయము పనిచేయు వేళలలో విచారించి తెలుసుకొనవచ్చును.

| వ. నెం. | లీజు కాలపు పరిమితి | లీజు వివరములు | చెల్లించవలసిన ప్రథమ ధరావత్తు | సాల్వెన్సీ తేవలసిన మొత్తము |
|---|---|---|---|---|
| 1) | 1986-87 | బస్టాండువద్ద కాఫీహోటలు భవనమందు భోజనం మరియు ఫలహారముల శాల పెట్టి ఉపయోగించుకొను హక్కు | 3006/- | 35000/- |
| 2) | .. | బస్టాండు కాఫీహోటలు భవనం ముందుగల స్టాల్సునందు 1. స్టాలు నెం. 1) యందు పండ్లు మరియు పూలు కొట్టు యుంచి నిర్వహించుకొను హక్కు | 1000/- | 20000/- |
| | .. | 2. స్టాలు నెం. 2) యందు ఫ్యాన్సీ మరియు బీడి షాపు యుంచి నిర్వహించుకొనుహక్కు | 500/- | 20000/- |
| | .. | 3. స్టాలు నెం. 3) యందు ఫ్యాన్సీ మరియు బీడి షాపు వుంచి నిర్వహించుకొనుహక్కు | 500/- | 20000/- |
| | .. | 4. స్టాలు నెం. 4) యందు సోడా షాపు వుంచి నిర్వహించుకొను హక్కు | 1000/- | 25000/- |
| 3) | .. | బస్టాండువద్దగల మంగలి షాపు కొట్టునందు క్షౌరశాల యుంచి నిర్వహించుకొను హక్కు | 100/- | 2000/- |
| 4) | .. | బస్టాండునందుగల పుస్తకముల స్టాలునందు దిన, వార, మాస పత్రికలు మరియు ఇతర పుస్తకములు పెట్టి నడుపుకొనుహక్కు | 200/- | 1000/- |
| 5) | .. | బస్టాండు నందు బస్సుల పై రుసుము వసూలు చేసుకొను హక్కు | 300/- | 2000/- |
| 6) | .. | కూరగాయల మార్కెట్టునందు రుసుం వసూలుచేసుకొను హక్కు | 100/- | 2000/- |
| 7) | .. | మాంసము మరియు చేపల మార్కెట్ నందు రుసుము వసూలుచేసుకొను హక్కు | 500/- | 5000/- |
| 8) | 1986-87 నుండి 1988-89 | కూరగాయల మార్కెట్ముందు గల 1వ నెం. కొట్టు | 500/- | 7500/- |
| 9) | .. | కూరగాయల మార్కెట్ముందు గల 2వ నెం. కొట్టు | 500/- | 7500/= |
| 10) | .. | కూరగాయల మార్కెట్ముందు గల 3వ నెం. కొట్టు | 500/- | 7500/= |
| 11) | .. | కూరగాయల మార్కెట్ముందు గల 4వ నెం. కొట్టు | 500/- | 7500/- |
| 12) | .. | కూరగాయల మార్కెట్ముందు గల 5వ నెం. కొట్టు | 500/- | 7500/- |
| 13) | .. | బండిలదొడ్డి వీధిలోని 1వ నెం. కొట్టు | 500/- | 7500/- |
| 14) | .. | బండిలదొడ్డి వీధిలోని 2వ నెం. కొట్టు | 500/- | 7500/- |
| 15) | .. | బండిలదొడ్డి వీధిలోని 3వ నెం. కొట్టు | 500/- | 7500/- |
| 16) | .. | బండిలదొడ్డి వీధిలోని 4వ నెం. కొట్టు | 500/- | 7500/- |
| 17) | .. | బండిలదొడ్డి వీధిలోని 5వ నెం. కొట్టు | 500/- | 7500/- |

—యజ. శ్రీనివాసరావు
కార్యనిర్వాహకాధికారి.

## హెగ్డే

(మొదటి పేజీ తరువాయి)

వేళ ఆ ఆదేశాలను తీవ్రంగా తీసుకున్నా, దాని ఆశాఖ మంత్రి రాజీనామా ఇచ్చి వుండాలి; అంతే!

కాని హెగ్డేయే రాజీనామా ఇవ్వదలచుకున్నాడంటే, పదవి తనకెంత తృణప్రాయమో, సిరి నిజాయితీలకెంత ప్రాధాన్యమిస్తాడో మరొకసారి లోకానికి చాటుకోవడానికి హెగ్డే రాజీనామా చేసి వుండవచ్చు. ఈ రాజీనామాలో రాజకీయ ప్రత్యేకంకూడా లేదనడానికి వీలులేదు. హైకోర్టుతీర్పు ఆధారంగా ముఖ్యమంత్రి రాజీనామాచేయాలని కర్నాటకలోని కాంగ్రెస్‌సాది ప్రతిపక్షాలు నినాదం లేవదీశాయి; దాన్ని రాజకీయ ప్రయోజనాలకుపయోగించుకోవడానికిసమకట్టాయి; అది సహజం. ఆ ప్రతిపక్షాలకు చెంపదెబ్బగా వుపయోగపడుతుందని, వారి నోళ్ళు మూయిస్తుందని హెగ్డే ఈ రాజీనామా ఆయుధాన్ని ప్రయోగించినా ప్రయోగించివుండవచ్చు. అదీకాక, తన స్వంతపార్టీలోకూడా తనకు వ్యతిరేకవర్గం వున్నట్లుంది; వారి వైఖరిపట్ల నిరసనగాకూడా హెగ్డే తన రాజీనామాను వుద్దేశించివుండవచ్చునంటారు.

ఏమైతేనేమి, హెగ్డే రాజీనామా దేశవ్యాప్తంగా పెద్ద సంచలనాన్ని కల్గించింది; అతని నిజాయితీకి జేజేలు పలికించింది. ఆయన స్వరాష్ట్రంలో అయితే ఈరాజీనామా రాజకీయవర్గాలన్నిటికీ ఒక 'షాక్ ట్రీట్‌మెంటు' గా పనిజేసిందాలనిపిస్తుంది. ఈనాడు ఆయన్ను రాజీనామా చేయవద్దని విజ్ఞప్తి చేసేవాళ్ళు, ప్రాధేయపడేవాళ్ళేకాని 'శని'పోయిందనుకునేవారే లేరు. జనతాపార్టీ శాసనసభ్యులు, కార్యకర్తలైతే ఆయన రాజీనామా నిర్ణయానికి కంటతడిపెడుతున్నారు; ఆయనచేత రాజీనామా వుపసంహరింపచేయడానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు. హెగ్డే తన రాజీనామాను వుపసంహరించుకుంటాడా లేదా అనేది ఇది వ్రాస్తున్న సమయానికి తేలలేదు. కాని తన రాజీనామా ద్వారా హెగ్డే కర్నాటకలో తన పార్టీ అధికారానికి మరోటరమ్ ముందుగానే ప్రజలనుండి లీజును పొందాడు; కాంగ్రెస్‌కు వున్న బలాన్నికూడా దెబ్బతీయగలిగాడు. ఒక్కమాటలో చెప్పాలంటే హెగ్డే నీతినిజాయితీలుగల నాయకుడుగా తాను పెరిగాడు, తన పార్టీని పెంచాడు.

ఇక ఇక్కడ మన ముఖ్యమంత్రి ఎన్టీ రామారావుగారో, నైతిక విలువలకంటే పదవే ప్రాణప్రదం! కోర్టులు ఎన్నిసార్లు ఎంతగా చురకలువేసినా, వ్యతిరేకంగా తీర్పులుచెప్పినా ఆయనకు చీమకుట్టినట్టుకూడా వుండదు. రామారావుగారికి, ఆయన ప్రభుత్వానికి వ్యతిరేకంగా హైకోర్టు, సుప్రీంకోర్టులు ఇచ్చిన తీర్పులు పరిగణనకు తీసుకొని, హెగ్డేవలె వున్నత ప్రమాణాలను పాటించేట్లుంటే ఆయన ఈపాటికి ఎన్నిసార్లు రాజీనామా ఇచ్చివుండవలసిందో చెప్పలేము. మైనింగ్ కార్పోరేషన్ మేనేజింగ్ డైరెక్టరు శ్రీ ఇ. ఎస్. రెడ్డి దావాకు సంబంధించి హైకోర్టు రామారావుమీద చేసిన వ్యతిరేక వ్యాఖ్యలు తీసుకుంటే, ఎంత అభిమానంలేని వ్యక్తికూడా ఒక్క క్షణం అధికారంలో వుండడానికి వీలులేదు. కృష్ణజిల్లాలో పెరోల్‌కు సంబంధించి నరేననుకోండి. ప్రభుత్వోద్యోగుల రిటైర్‌మెంటు విషయంలో సుప్రీంకోర్టుతీర్పు, న్యాయమూర్తి విమర్శలు; నిన్నమొన్న పునర్విభజన సమితిగా మాధికార్లు సంబంధించి ప్రభుత్వానికి వ్యతిరేకంగా హైకోర్టు యిచ్చినతీర్పులో వీటన్నిటిని జరిగిన నరుతీసుకొని రామకృష్ణ హెగ్డేతో మన రామారావుగారిని పోల్చినంటే రాజకీయాలలో ఆయన నైతికస్థాయి ఏపాటిదో విదితమవుతుంది. రామారావుగారికి పరువు ప్రతిష్ఠ, ప్రజాసేవారంగంలో ప్రమాణాలు ఏమీలేవనేది స్పష్టం. ఇది సంగతి! ★

## మడమనూరు

(5వ పేజీ తరువాయి)

నించి సుబ్బారెడ్డి కట్టమీదనుంచి, ప్రక్కన పొలాల్లోకిదూకి పరారైనాడట; వెంకురెడ్డి దారికి చిక్కిపోయాడట. ఈ లోగా దాదాపు ఇరవైమంది కత్తులు గొడ్డళ్ళతో వెంకారెడ్డిని చితకబొడిచారట. శవాన్ని మనుబోలు రైల్వేస్టేషన్ సమీపంలో, పట్టాలపక్కన పారేసి వెళ్ళారట.

ఈ హత్యతో గ్రామంలోని మార్క్సిస్టులు, తెలుగుదేశం వారికి సంబంధం వుందట! వెంకురెడ్డి కాంగ్రెసు వర్గీయుడు; మడమనూరు మాజీ సర్పంచ్, మాజీ ఎమ్మెల్యే శ్రీ సి. వి. శేషారెడ్డి శిష్యుడు. దాదాపు పందొమ్మిదేళ్ళక్రితం ఈ గ్రామంలో తొలిహత్య జరిగింది. ఆ తర్వాత వరిపరిహేనేళ్ళు పూరకుంది. ఇటీవల సంవత్సరాలలో తిరిగి కక్షలు గెలుకుంటున్నారు.

( వ పేజీ తరువాయి)

## మరణాలు

మాజీ మునిసిపల్ కౌన్సిలరు, కాంగ్రెస్‌వాది శ్రీ దొంతంశెట్టి కన్నయ్య ధర్మపత్ని శ్రీమతి సుశీలమ్మ (57) హెమరేజ్‌తో 30 తేది హఠాత్తుగా మరణించింది. ఆమెకూడా మునిసిపల్ కౌన్సిలరుగా పనిచేసింది. ఆమెకు ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు.

వృద్ధాప్యంలో జీవిత భాగస్వామిని కోల్పోయిన శ్రీ కన్నయ్యకు మా సంతాపం తెలియజేస్తున్నాము.

* * *

వి. ఆర్. కాలేజిలో ఫిజిక్స్ డెమాన్‌స్ట్రేటరుగా, తర్వాత లెక్చరరుగా 35 ఏళ్లపాటు పనిచేసి రిటైరైన శ్రీ కె. కళ్యాణరామన్ (70) 6 తేది కాలధర్మం చెందారు. ఈయన కీ. శే. వేలూరు రామదాస్ అయ్యంగార్ అల్లుడు.

## పంచాంగం

### శుక్రమౌఢ్య నివృత్తి

19-2-1986 తేది మాఘ శుద్ధ దశమి బుధవారం శుక్రమౌఢ్య నివృత్తి.

### ఫిబ్రవరి తిథులు

15 శని షష్ఠి ప. 9-16 గం. వ.
16 ఆది సప్తమి ప. 11-25 గం. వ. రథసప్తమి
17 సోమ అష్టమి ప 1-29 గం. వ.
18 మంగళ నవమి ప. 3-40 గం. వ.
19 బుధ దశమి సా. 5-33 గం. వ.
20 గురు ఏకాదశి రా. 7-19 గం. వ.
21 శుక్ర ద్వాదశి రా. 8-23 గం. వ.

—నిమ్మగడ్డ వేంకటేశ్వరశాస్త్రి



# జయభారత్ హాస్పిటల్

నెల్లూరు-3. ఫోన్ నం. 4604

## అంబులెన్స్ కమ్ మొబైల్ మెడికల్ యూనిట్

## సేవాపథంలో ప్రజాబాహుళ్యానికి అంకితం

ఈ అంబులెన్స్ సేవలు నెల్లూరుజిల్లాలోని ఏగ్రామంవారికైనా, ఏ ఆస్పత్రికైనా, ఏ డాక్టరుకైనా ఏ పేషెంటుకైనా, నెల్లూరుకు గాని, మద్రాసుకుగాని, మరేపట్టణానికిగాని, తిరిగి ఏ గ్రామం నికైనా కనీసపు ఛార్జీలతో అందుబాటులో వుంటాయి.

### ప్రారంభోత్సవ కార్యక్రమము

రథసప్తమి పర్వదినాన

## 16-2-1986 ఆదివారం 9 గంటలకు

ముఖ్య అతిథి: సి. కె. శుభప్రదమ్మగారు (కస్తూరిదేవి విద్యాలయం కరెస్పాండెంట్)

అధ్యక్షులు : గోరంట్ల రాధాకృష్ణగారు (నెల్లూరు నగర జెసీస్ అధ్యక్షులు)

ప్రారంభకులు: సామంతుల గోపాలరెడ్డిగారు (ప్రముఖ కాంట్రాక్టరు)

ఈ సందర్భంలో కుటుంబ ఆరోగ్యపథకం, శ్రామిక ఆరోగ్యపథకంకూడా ప్రారంభమవుతున్నాయి.

### ప్రస్తుతం మన 'జయభారత్'లో

* 30 పడకలు (రెండు స్పెషల్ రూములతో)
* పెద్ద, చిన్న ఆపరేషన్లు తక్కువ ఖర్చుతో
* ఇన్‌పేషెంటుకు నర్సింగుతోసహా రోజుకు రూ 5 లు.
* ప్రసూతి సౌకర్యం తక్కువ ఖర్చుతో
* అన్నిహంగులుగల ఆపరేషన్ థియేటర్
* కన్సల్టేషన్‌ఫీజు రూ 2 లు (నెలరోజులకు)
* క్లినికల్ లేబొరేటరీ (తక్కువ ఛార్జీలతో)

మాస్టర్‌ప్లాన్ (బృహత్పథకం):- నూతన భవన నిర్మాణం జరుగుతోంది. భూరి విరాళాలనిచ్చి తోడ్పడవలసినదిగా దాతలకు మా విజ్ఞప్తి.

### సింహపురి వైద్యసేవాసమితి (ట్రస్ట్):

మారంరెడ్డి రామరాఘవరెడ్డి, మద్రాసు - అధ్యక్షులు
డా. వై. జె. ప్రభాకరరెడ్డి, గూడూరు - ఉపాధ్యక్షులు
పొన్నలూరు సీతారామరెడ్డి, నెల్లూరు - ప్రధానకార్యదర్శి
బొమ్మిశెట్టి వీరరాఘవులు, ,, - కోశాధికారి
యరగుడిపాటి నరసయ్య, ,, - సభ్యులు
డా. జి. వి. కృష్ణారెడ్డి, బుచ్చిరెడ్డిపాళెం - సభ్యులు
ఎమ్. వి. కృష్ణయ్య, నెల్లూరు - సభ్యులు

### మార్గదర్శకమండలి:

జె. వి. రెడ్డి, నెల్లూరు
కాటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి, ,,
డా. సి. పి. శాస్త్రి, నెల్లూరు ,,
డా. కె. బి. చలపతిరావు ,,
డా. జె.ఎస్.రామచంద్రమూర్తి ,,
రేబాల శివకుమారరెడ్డి, నార్త్ మోపూరు
కోట సుబ్రహ్మణ్యం, నెల్లూరు
మొద్దపల్లి గోవిందుశెట్టి, ,,

వివరాలకు ఫోన్ నం. 4604 లో సంప్రదించండి.

## ఆవులు తప్పిపోయినవి

నెలరోజుల క్రిందట నెల్లూరు అంబాపురం వద్దనుండి రెండు ఆవులు, ఒక యెదదూడ (తెల్లవి): ఒక నల్ల కోడెదూడ తప్పిపోయినవి. ఆచూకి తెలిసినవారు దయతోమాకు తెలుప ప్రార్థన.

సన్నపురెడ్డి రాఘవరెడ్డి
ఫిజిక్స్ డిపార్టుమెంట్
వి. ఆర్. కాలేజి నెల్లూరు
ఫోను: 3279. నెల్లూరు.





జమీన్‌రైతు చందా

| | |
|---|---|
| ఆరు నెలలకు | 26.00 |
| సంవత్సరానికి | 50.00 |
| విడి ప్రతి | ఒక రూపాయి |

# శివారెడ్డి పద్యాలు

### లైఫు

ఎక్కణ్ణుంచొస్తారో
ఎక్కడకెల్తారో తిరిగి ఏమౌతారో
వొక్కనికీ నిరాన్యము
చిక్కటయుల్పడదు, అతివిచిత్రము లైఫు!

ఒక్కడేమొసేద, వొకడేమొమహారాజు
వొకడకేమొబంగ్లా, వొకనికేమొ
పూరిపాక, తారుమారీప్రపంచమ్ము
ఎగుడుదిగుడు దీనికెవరు కర్త?

ఉట్టిగట్టకోని పూరేగేదేమీల
వున్నవాడు, లేని నన్నగాడు
ఉభయులొకటిమృత్యువునకుకష్టసుఖాలు
రెస్సపాటి పోరు కప్పగూలి

కనులుచెవులువొకటి, కాలుచేతులువొకటి
నాసికొకటి నోట్లొ నాలుకొకటి,
కలిమిలేమితేడ కాస్త వ్యత్యాసమ్ము
దీనిదేందితమ్ము! దిగులుపడకు.

### జోస్యము

టక్కుటమారము జోస్యము
ఎక్కడోకొవారు పాపమెంటియార్లూ,
చిక్కులో బెట్టేళారూ,
పక్కనవివ్వంది యువ పత్రికముఖతా!

ఇండియాప్రధాని సిద్దైతె, నే రాష్ట్ర
ముఖ్యమంత్రినౌత నీముతకకవిని,
యూపునేసుకలిసి యిండ్యాను స్వర్గంగ
తీర్చిదిద్దుదాము రామరావు!

### శిరోముండనము

మరులుఎక్కువైయ్యె మనసునెమ్మదిలేక
ఎంగరల్సు ఏదొ ఏకొక్కొస్తె
పట్టుకొచ్చి గుండుగొట్టి పంపించింది
కాకుట్ల! ఏమికరువుమంటొ!

ముక్తురాదవచ్చు ముచ్చటబడవచ్చు,
సినిమాల్లొ దాసు చెర్లగ్రామ,
కదుపుగాలి ఏదొ కప్పుక్రిందయుంటి
దాటుమాయె తప్పు? మాలకంట!

### కామ్రేడ్ రామచంద్రయ్య

కత్తిలేని వచ్చికాంమ్రేదు గునుపాటి
రామచంద్రయ్య కేమిమోజు
ఒదుగుతావులపైన బస్తా గిరెదుతాదు,
సీ. పి. యైయ్యుసొత్తు చేదు మత్తు!

### రాజీనా

రామకృష్ణహెగ్డె రాజీనామజేసి
కొంపజేసినాడు, కోర్టువారి
తీర్పుననుసరించి, తెలుగుపార్టీనేత
రామరావు కిదొకరకమువాత!

# జిల్లావార్తలు

( . వ పేజీ కొరవ)

ఈ సందర్భంగా ఒక చిన్నసభ జరిగింది. డాక్టర్ సి. ఎన్. రఘునాథాచారి, ఎ. శ్రీనివాసరావు, ఎ. వి. కృష్ణారావు తదితరులు మాట్లాడారు. డాక్టర్ల చేత కొంతమంది రోగులను పరీక్షలు జరిపించారు; ఫిలింషో ప్రదర్శించారు.

### ఒజిలి స్పీడ్‌బ్రేకర్లు

ఒజిలి, గ్రాండ్ ట్రంకురోడ్డును ఆనుకొని వుండే గ్రామం; ఎప్పుడూ జనం రోడ్డుపైనే నీళ్ళకోసమో, బస్సులకోసమో నిలబడివుంటారు. అయితే ట్రంకురోడ్డు కావడంతో రాత్రీపగలు విరామంలేకుండా రామందాడిగా వాహనాలు తిరుగుతుంటాయి; వాటి వేగంచూస్తే గుండెబేజారెత్తిపోతుందని, దీనికి బ్రేకువేయడానికి, స్పీడ్‌బ్రేకర్లు కట్టించాలని శ్రీ సి. హెచ్. జేసుదాస్ కోరుతున్నారు.

### బ్రాహ్మణక్రాక స్కూలు

కావలి తాలూకా బ్రాహ్మణక్రాకలో హైస్కూలుపెట్టి పాతికేళ్ళు కావస్తోంది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని రజతోత్సవాలు జరపాలని పాత విద్యార్థుల సంఘం తలపెట్టింది. సర్పంచ్ శ్రీ వంటేరు జయరామరెడ్డి, వేలమూరు చిన వెంకారెడ్డి, హెడ్మాస్టరు శ్రీ ప్రకాశరావు తదితరులతో కమిటి ఏర్పాటు చేశారు. పాతవిద్యార్థుల అడ్రసులు చెప్తే, ఆహ్వానాలు పంపుతారట.

### నిరుపయోగమైన నక్కలకాలువ

నక్కలకాల్వకు అమిత లక్షలు ఖర్చుపెట్టి, రిపేర్లు చేశారట. డ్రైనేజి కాలువ ఇది. దీన్ని సక్రమంగా నిర్వహిస్తే, వేలాది ఎకరాలకు ముంపు వుండదు. అయితే, పెట్టిన లక్షలు ఎక్కడ ఖర్చుచేశారోగాని, మొన్న జనవరి వానలకు కనుపర్తిపాడు యాగర్లనుంచి, ఈపూరు వెంకనపాలెంవరకు దాదాపు 4 వేల ఎకరాలలోని పంట నీటిపాలైపోయిందట. ఇంత నిరుపయోగమైన కాలువ మాకెందుకని ప్రశ్నిస్తున్నారు- శ్రీ ఈపూరు వెంకరెడ్డి. పిడబ్ల్యుడిఅధికారులు జవాబు చెప్పగలరా?

### ప్రారంభోత్సవాల ప్రహసనం

ఉదయగిరి తాలూకా భైరవరంలో కొత్తగా కడుతున్న రెండు ఇళ్లకాలనీలకు జనవరి 17 తేది, బి జె పి నాయకుడు శ్రీ ఎం. వెంకయ్యనాయుడు తమ పార్టీకి చెందిన ఒక తెలంగాణా ఎం. ఎల్. ఏ. చేత ప్రారంభోత్సవాలు చేయించారట. ఈ రెండింటి నిర్మాణం ఇంకాపూర్తికాలేదట, ఈప్రారంభోత్సవాలసంగతి సమితి అధ్యక్షుడు, బి. డి. ఒ., కలెక్టర్ వంటి వారెవరికి తెలియకుండానే జరిగిపోయాయట. ప్రభుత్వ ఆస్తులను ప్రభుత్వాధికార్లకు తెలియకుండా వినియోగించుకున్నారని, బి. జె. పి. నాయకులపై శ్రీ ఎం. నారాయణరెడ్డి కోర్టులో కేసు దాఖలుచేసినట్లు తెలుస్తున్నది.

వెంకయ్యనాయుడు ఒక్క ఎన్నికతోనే ఆత్మకూరును వదిలేసి మళ్లీ ఉదయగిరిని వరిస్తున్నారనడానికి ఈ సంఘటనను సాదృశ్యంగా తీసుకోవచ్చా?

### పొదలకూరు థ్యాంక్స్

దీర్ఘకాలంగా అపరిష్కృతంగా వున్న పొదలకూరు టీచర్ల సమస్యల పరిష్కారం కోసం ఆమధ్య యు టి ఎఫ్ నాయకులు నిరాహారదీక్షలు చేయ తలపెట్టారు. అయితే బి డి ఓ శ్రీ ఎన్. వెంకట్రావు, ఆందోళన ప్రారంభం కాకముందే, చర్చలద్వారా సమస్యలు పరిష్కరించారట. యు టి ఎఫ్ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. శ్రీనివాసరావు థ్యాంక్స్‌చెప్తున్నారు.

### వింజమూరు ఒప్పందం

క్రమోషన్లు, గ్రేడు, రీగ్రూపింగ్ స్కేలు వంటి పలుసమస్యలపై వింజమూరు టీచర్లకు బి. డి. ఒ. మధ్య ఒక ఒప్పందం కుదిరిందట. దీనికిముందు టీచర్లు సమితి ఆఫీసు ఎదుట ధర్నా చేశారు. ఈ ధర్నా శిబిరాన్ని శ్రీ కె. తిరుపాలు ప్రారంభించారు.

# అరబ్ స్త్రీల స్వేచ్ఛాసూచిక

**లైలా అండ్ ది ఊల్వ్స్**

స్త్రీ విభాగంలో చూపిన [illegible] లలో మహోజ్జ్వల చిత్రం ఇది. హైన్రాన ఈ సినిమాకు దర్శకురాలు. 1930 లలో, వలసపాలనకు వ్యతిరేకంగా, ఈజిప్టులో పురుషులతోపాటు, భుజంభుజం కలిపి పోరాడిన స్త్రీల వీరోచిత చరిత్ర ఈ సినిమా ఇతివృత్తం. పురుష దృక్పథం నుంచి, అదీ వైయుక్తిక దృక్పథం నుంచి చరిత్ర, సాహిత్యం, కళలు పరిశీలించ బడుతున్న ఈ రోజుల్లో వర్గ దృక్పథం నుంచి, అదీ స్త్రీల దృక్పథంనుంచి చరిత్రను, స్త్రీల ఉద్యమాలను నిరూపించిన సినిమా ఇది.

అరబ్‌దేశాల స్త్రీల చైతన్య స్థాయిని గురించి మనలో అనేకులలో ఉన్న పొరపాటు అవగాహనకూడా ఈ చిత్రం తెరిపివేస్తుంది: ఈ కథాప్రా ఆరంభం లోనే అరబ్‌స్త్రీలు స్వేచ్ఛకోసం ఎన్నో త్యాగాలు చేశారు. పెళ్ళి కూతురు నూతన వస్త్రాలంకరణను కూడాలు పంపు తారు; ఫలహారాల పళ్ళాలలో రివాల్వర్లు పెట్టి పందారం చేస్తారు. ఆఖరుగా విముక్తి ఉద్యమంలో స్త్రీలు కుటుంబ జీవితాన్ని, ప్రాణాలనూ తృణప్రాయంగా త్యాగంచేస్తారు.

లైలా అండ్ ది ఉల్వ్స్ చిత్రం గతాన్ని వర్తమానాన్ని ఒక్కసారిగా మనముందు పుంచుతుంది. అరబ్ స్త్రీల పోరాట చరిత్రను మనకళ్ళముందుంచుతుంది. అరబ్ స్త్రీల చైతన్యస్థాయిని వెలియజేస్తుంది. ఇంకా వాళ్ళలో మిగిలిపోయిన మూఢా చారాలను ఎత్తిచూపుతుంది.

బోటేట్కు ఉండటం సాధారణమే. వాటినుంచి గొర్రెలమందను కాపాడే పక్షుల కాపరికూడా ఉండాలి' అనే భావం వ్యక్తంచేసే పాటతో సినిమా ప్రారంభం అవుతుంది. సముద్రతీరంలో పురుషులు స్వేచ్ఛగా ఆడుతూ, పాడుతూ వినోదిస్తూవుంటారు. బురఖాలు ధరించిన స్త్రీలు ఒకవైపుకూర్చొని దాన్నంతా చూస్తూంటారు. సినిమా ముగిసేసమయా

నికి ఆ స్త్రీలుకూడా సముద్రంలోకి దిగుతారు. సముద్రం చైతన్యానికి సంకేతమైతే, చైతన్యం వాళ్ళనూ స్పృశించిందని దర్శకురాలు అంటుంది.

లైలా పాత్ర ఈ సినిమా కథనానికి కేంద్ర బిందువు. లైలా బెలనాళలో ఒక విద్యార్థిని. పురుషాధిక్య సమాజంపై ఆమెకు ఏవగింపు. మహిళల త్యాగమయ పోరాటాలచరిత్ర పురుషులకేమీ తీసిపోదని చెప్తుంది. ★

ఫిల్మోత్సవ్ 86
Filmotsav 86

# వృద్ధాప్యంలో తోడుకై...

**నంబర్ 36, చౌరంగీలేన్**

మొదటి చిత్రంతోనే ప్రఖ్యాతిలోకి వచ్చిన దర్శకులలో అపర్ణాసేన్ ఒకరు. గొప్పనటిగా ఆమెకు పేరు ఉంది.

వృద్ధాప్యంలో ఒంటరి జీవితం ఎంత శూన్యంగా, కాంతిహీనంగా ఉంటుందో దర్శకురాలు ఈ సినిమాద్వారా చూపుతుంది వయసు పైబడుతున్న ఒక ఆంగ్లో ఇండియన్ వృద్ధ స్త్రీ. కలకత్తాలో ఒక స్కూల్లో ఎక్కటీచపనిచేస్తూ ఉంటుంది. నా ఒన్నవాళ్ళెవరూ ఉండరు. కావలసినవాళ్ళు విదేశాల్లో ఉంటారు. వాళ్ళురాసే జాబులే ఆమెకుఆనందాన్ని, సంతోషాన్ని కలిగి

—తరువ 18 వ పేజీలో

# చైనా స్త్రీల ఆశల ప్రతీక

**గర్ల్ ఇన్ ది రెడ్**

శైశవ బాల్యదశలు గడచి యవ్వనం రూపుదిద్దుకునే క్రమంలో వ్యక్తిత్వ వికాసం ఈ చైనా చిత్ర కథాంశం. ఒక బాలిక అంతరంగ మథనమే ఇందులో ఇతివృత్తం. సెలయేరులా వరుగెత్తే, జలపాతంలా జారే మాయమర్మం ఎరుగని బాల్యాన్ని, యవ్వన ప్రాయర్భావదశను ఒక గీతంగా, ఒక కవితగా, దర్శకురాలు చిత్రీకరించింది.

సత్యజిత్‌రే 'తీతకవ్య'ను ఈ చిత్రం గుర్తుకు తెస్తుంది. 'రాన్‌రాన్' ప్రత్యేక వ్యక్తిత్వం ఉన్న బాలిక. తన వయసు బాలికలకు భిన్నంగా ఆలోచిస్తుంది; ప్రతి విషయాన్నీ హేతుబద్ధంగా తెలుసుకోవాలని ఆకాంక్షిస్తుంది. ప్రకృతిలోని ప్రతి విషయాన్నీ గ్రహించాలనే జిజ్ఞాస శైశవంలో అందరికీ సహజమైనదే. అయితే వయసు వస్తున్న కొద్దీ ఈ స్వభావం ఆమెలో గట్టిపడుతుంది. ఇంట్లో బయటా నిర్మొహమాటంగా, ముక్కుసూటిగా ప్రవర్తిస్తుంది. అందరికీ చికాకు కలిగిస్తుంది; తను చేసింది మంచిపనే అయినపుడు లోకాన్నంతా ఎదిరించడాని కైనా సిద్ధపడుతుంది.

రాన్‌రాన్ తండ్రి ఒక చిత్రకారుడు. అతని ఆర్థిక జీవితంలో పెద్ద ఎదుగుదల వుండదు. రాన్‌రాన్ తల్లి ఏదో చిన్నపని చేస్తూవుంటుంది. ఆమె జీవితం నిండా నిరాశలు. ఆమె దృష్టిలో తనభర్త 'చేతగానివాడు'. రాన్‌రాన్‌కు ఒక పెళ్ళికావలసిన అక్క వుంటుంది. ఇదీ ఆ కుటుంబ నేపథ్యం.

అయిదు తరగతుల చదువులకు రాన్‌రాన్ తరగతినుంచి ముగ్గురు ఉత్తమ విద్యార్థుల్ని విద్యార్థులే ఎన్నికచేసుకో వాలి. రాన్‌రాన్ తరగతిలో అన్ని సబ్జక్టుల్లో ఫస్టుమార్కులు తెచ్చుకొంటుంది. అయితే ఆమె విశిష్టస్వభావాన్ని సాటివిద్యార్థులు సరిగా బోధపరచుకో లేరు. రాన్‌రాన్ క్లాసుటీచర్ రాసిన కవితల్ని, రాన్‌రాన్ అక్కయ్య తన పత్రికలో అచ్చువేసి ప్రోత్సహించినందువల్ల, కృతజ్ఞతాసూచకంగా ఆ టీచరు రాన్‌రాన్‌నుకూడా ఉత్తమవిద్యార్థిగా ఎన్నికయ్యేటట్లు చేస్తుంది. ఈ విషయంతెలిసి, రాన్‌రాన్ తనకు లభించిన గౌరవాన్ని తిరస్కరిస్తుంది. చిన్నచిన్న సంఘటనలతో ఒకబాలిక యువతిగా పరిణతిచెందే క్రమంలో ఎదురయ్యే భావావేశ సంఘర్ష

—తరువ 13వ పేజీలో

‘ముద్దుల కృష్ణయ్య’లో బాలకృష్ణ, రాధ




భరతనాట్య ప్రదర్శనలిస్తూ బొంబాయిలో ఒకటి రెండు హిందీ చిత్రాలలో నటించిన వాణిని కమలహాసన్ చూసి, ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు. ఎంత కాలమైనా పిల్లలు కలగలేదనే కొరత కమల్‌ను పీడిస్తూ వచ్చింది. ఇంతలో కమల్ ఒక హిందీచిత్రంలో నటించడానికి బొంబాయి వెళ్ళినప్పుడు నటి సారికను చూసి ఆమెమోజులోపడ్డాడు. కమల్ పక్కన హీరోయిన్‌గా నటించే చిత్రాలు రావచ్చుని ఆశపడింది సారిక. అంచేత బొంబాయిలో కమల్ బసచేసినహోటల్‌కు తరచు వెళ్ళిరావడం మొదలెట్టింది. గర్భనిరోధక పద్ధతులెన్నో వుండగా తన కొంపేం మునగదనుకున్నాడు కమల్. షూటింగ్ అయిపోయాక మద్రాసు కు తిరిగివచ్చేశాడు. కమల్ మంచి స్థితిమంతుడన్న విషయం దృష్టిలోవుంచుకొని సారిక తనపథకం ప్రకారం ఓనుమహారాన తాను గర్భవతి అనీ, తనగర్భంలో పెరుగుతున్న నలుసుకు కమల్ తండ్రి అనీ ప్రకటించి, గొప్ప సంచలనం సృష్టించింది.

ఇంతవరకు వస్తుందని అనుకోని కమల్ ముందు చకితుడైనా ఆతర్వాత ఆ విషయం నిజమని ఒప్పుకోక తప్పలేదు. దీనితో కమల్‌భార్య వాణి ఆగ్రహం చెందింది. "నువ్వు గొర్రెలివి, బిడ్డకు తండ్రి అవ్వాలన్న కోరిక నాకు వుండదా? నేను సారికను చట్టబద్ధంగా పెళ్ళాడకపోయినా ఈపరిస్థితిలో ఆమే నాభార్య అని అంగీకరించక తప్పదు" అన్నాడుకమల్. అనడమేకాక బొంబాయి వెళ్ళి నిండుచూలాలు సారికను తీసుకొచ్చి మద్రాసులోని ఒకపెద్ద పైవ్‌స్టార్‌హోటల్లో ఉంచాడు. ఇటీవల ఆమె ఆడపిల్లను ప్రసవించగానే ఆమెకోసం హేమమాలిని భవనం ఒకదాన్ని అద్దెకు తీసుకుని, అందులోకి మకాం మార్పించాడు.

ఊళ్లో పెళ్ళికి కుక్కల హడావిడి అన్నట్లు కమలహాసన్ అభిమానులు

> మా మద్రాసు
> సినీ విలేఖరి

ఇదేదో సంతోషకరమైన వార్త అయినట్లు అందరికీ మిఠాయిలు పంచిపెట్టారు.

పాపం! వాణి గోడు పట్టించుకొనే వారెవరు? ముందునుంచే సారిక విషయాన్ని కమల్ కొద్దిగానైనా తెలియజేసి వుంటే ఆమెకింత షాక్ తగిలివుండేది కాదు. హఠాత్తుగా ఈవార్త వినడంతో ఆమెకు ఆకాశంవిరిగి నెత్తినపడ్డట్లయింది.

ఇదిలావుండగా కమల్ తండ్రి, సుప్రసిద్ధ లాయరు సారికను, శిశువునుచూసి ఎంతో మురిసిపోయాడట. ప్రముఖ న్యాయవాది అయిన ఆయన, కమల్‌ను సమర్థించడమేమిటని చాలామంది విస్తుపోయారు.

## "ముద్దుల క్రిష్ణయ్య" ఫిబ్రవరి 28 న

అతి స్వల్పకాలంలో జనరంజకమైన చిత్రాల నిర్మాతగా తనకో సుస్థిరమైన స్థానాన్ని ఏర్పరచుకున్న ప్రతిభాశాలి ఎస్. గోపాల్‌రెడ్డి. ఈయన కోడి రామకృష్ణదర్శకత్వంలో నిర్మించిన "ముద్దుల క్రిష్ణయ్య" చిత్రం ఫిబ్రవరి 28 న విడుదలవుతుంది. ఇందులో నందమూరి బాలకృష్ణ, విజయశాంతి, రాధ, గొల్లపూడి, ఎస్. వరలక్ష్మి, వై. విజయ, కల్పనా

—తరువ 13వ పేజీలో

## నాకనీతీరం

(3వ పేజీ తరువాయి)

ప్రాక్టీసు అవిచ్ఛిన్నంగా సేవ చేస్తున్న వారిని సన్మానించడం ఒక సాంప్రదాయంగా వస్తున్నది. బార్ అసోసియేషన్ వున్నదనుకోండి. యాభైఏళ్ళు పాటు ప్రాక్టీసుచేసిన న్యాయవాదులను ప్రతియేటా ఒకరిద్దరిని సన్మానిస్తుంటారు; వారి చిత్రపటాలను ఆవిష్కరించడం చేస్తుంటారు.

ఇటువంటిసాంప్రదాయం ఇండియన్ మెడికల్ అసోసియేషన్ నెల్లూరుశాఖకు వున్నదోలేదో నాకు జ్ఞాపకంలేదు. వుంటే సంతోషం. లేకుంటే నాదొక సూచన. సహృదయంతో స్వీకరించగలరని ఆశిస్తాను.

నెల్లూరులో యాభైఏళ్ళనుంచిప్రాక్టీసు చేస్తున్న డాక్టరు నాకు తెలిసి, ఒక్కరే ఒక్కరున్నారు. వారు డాక్టరు కొండూరు రామకృష్ణమూర్తి. ఆయన ఎల్.ఎం.పి. ఆరోజుల్లో అరెగొప్ప. 1934 లో కాలేజిపాసై నెల్లూరులో ప్రాక్టీసు పెట్టారు; నాటినుండి నేటివరకు ప్రాక్టీసు చేస్తూనేవున్నారు; ఈనాడు ఆయన వయస్సు 75 సంవత్సరాలు. అల్లాడి అనంతనారాయణయ్య. రాజగోపాలాచారి రఘునాథసింగ్‌వగైరాడాక్టర్లకోవకుచెందిన వారు ఆరోజుల్లో అనరరి డాక్టరు గా కూడా రామకృష్ణమూర్తిగారు రోజు పెద్దాస్పత్రికిపోయి వైద్యసేవ చేసినట్లు కూడా జ్ఞాపకం.

డాక్టర్ రామకృష్ణమూర్తి పాపభీతి. దైవ భక్తిగల వ్యక్తి. ధనార్జనకంటే మానవతకు ప్రాధాన్యతనిచ్చిన వ్యక్తి. అందు వల్లే యాభై ఏళ్ళ ప్రాక్టీస్ అనంతరం ఆయన వెనుదిరిగి చూచుకుంటే ఏమి మిగిలివుంటుంది? - తండ్రి సంపాదించి ఇచ్చిన ఇల్లు. తాను సంపాయించుకున్న మంచితనంతప్ప! ఇవే ఈనాడు ఆయన ఆస్తులు.

సింహపురీయులకు యాభైఏళ్ళ వైద్య సేవ చేసిన డాక్టర్ రామకృష్ణమూర్తిగారిని మెడికల్ అసోసియేషన్ సన్మానించడం తనను తాను సన్మానించుకోవడమే అవుతుంది. సన్మానమంటే నా వుద్దేశ్యం 'పర్సు' కాదు; ఒక చిన్న పూలహారం. నాలుగు మంచిమాటలు: అంతే!

ఒక్క రామకృష్ణమూర్తిగారినే కాదు; అంతదీర్ఘకాలం సేవచేసిన ఇతర డాక్టర్లు ఎవరైనా వుంటే అటువంటి వారందరినీ సన్మానించడం వుచితంగా వుంటుంది. ఇండియన్ మెడికల్ అసోసియేషన్‌వారు, రోటరీ- లయన్స్ క్లబ్బులవంటి సేవా సంస్థలు నా ఈ చిన్న సూచననుగూర్చి ఆలోచించగలరని ఆశిస్తాను.

నాద

## జనవాణి

(3వ పేజీ తరువాయి)

బజారు సెంటర్‌లోని పబ్లిక్ పాయిఖానా లకు స్త్రీలువెళ్ళలేకపోతున్నారు. ఎప్పుడు చూసినా లారీలపై మనుషులు నిలబడి వుంటే స్త్రీలు రోడ్డులో తిరగడమే కష్టంగా వుంది. అధికారులు దయదలచి ఈ లారీ లను ఒక నిర్ణీతసమయంలోనే అనుమతించడం అవసరం.

నెల్లూరు -బాబు

### రెడ్డి సంఘంతో నాకు సంబంధంలేదు!

కావలిలో కొత్తగా ఏర్పడిన రెడ్డి జన సంఘం అధ్యక్షుడిన్ని నేనైనట్లుపత్రికలలో ప్రకటనలు వచ్చాయి. కాని, నాకీ సంఘంతో ఎటువంటి సంబంధంలేదు. అన్నికులాలు నాకు సమానమే. రెడ్డిజన సంఘంలో నేను సాధారణ సభ్యుడిన్ని కూడాకాదు.

కావలి -తేతిరెడ్డి మల్లికార్జునరెడ్డి.

### ట్యుటోరియల్ టోపి

నెల్లూరు తిప్పరాజువారివీధిలో వుండే ఒక ట్యుటోరియల్ కాలేజి, అన్నామలై విశ్వవిద్యాలయం బి. ఇ. డి. కోర్సుకు సీట్లుఇప్పిస్తామని చాలామంది విద్యార్థుల దగ్గర ఐదేసివందలు వసూలుచేసింది. ఇట్లా సొమ్ములు చెల్లించినవారి సంఖ్య వందల్లోనేవున్నా ఆశ్చర్యంలేదు.

కొన్నాళ్ళ తర్వాత సీట్లు రాలేదని, కట్టినడబ్బుల్లో రూ 125 లు ఖర్చయ్యాయనిచెప్పి. విద్యార్థులందరికీ రు375లు వాపసుచేశారు. చాలాతెలివిగా విద్యార్థులకు టోపీవేసింది ఈ కాలేజి. అసలు దీని నిర్వాహకులు విశ్వవిద్యాలయంలో సీట్లకోసం ప్రయత్నించారా అన్నదే సందేహం. చట్టానికి చిక్కకుండా, విద్యార్థులను దోచుకొనితింటున్న ఇటువంటి మోసగాళ్ళను అరికట్టేందుకు మార్గాలు లేవా? అధికారులకు ఇటువంటి విషయాలు పట్టవా?

తోడేరు -ఎస్. రవికుమార్

### ఆర్. టి. సి. బస్సులలో టార్పాలిన్ పట్టలు

నెల్లూరునుంచి నడిచే ఆర్. టి. సి. బస్సులలో కిటికీలకు టార్పాలిన్ పట్టలు కడుతున్నారు. ఇవి గాలికొడితే నిలవవు; వానకురిస్తే తడిసి, చీలిపోతాయి. రాత్రి పూట చలికాలం బస్సులలో ప్రయాణం చేయాలంటే ప్రాణానికొస్తుంది. ప్రైవేటు బస్సులుకూడా ఇటీవల కిటికీలకు అద్దాలు బిగిస్తున్నాయి; లేకుంటే కర్టెన్లవంటి పట్టలు పెడుతున్నారు. మొదటినుంచి అద్దాలతోనడిచే ఆర్. టి. సి. బస్సులలో గాలికి వూగులాడే పట్టలు కట్టడం- అభివృద్ధి అనుకోవాలా? ప్రయాణీకుల సౌకర్యం పట్ల అధికార్ల అలక్ష్యం అనాలా?

కోవూరు -ప్రాణ్

### ఉద్యోగాలు- విధానంలో మార్పు

ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజిలనుంచే నిరుద్యోగులనుపంపి, ఉద్యోగ ఖాళీలు నింపాలనే పాతవిధానం మళ్ళీ అమలుకు వచ్చింది. ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజిలో సీనియారిటీవున్న అభ్యర్థులకు ఇది ఎంతోసౌకర్యం.

గతంలో ఈ ఎక్స్చేంజిలు అసిలికి పేరుకుపేరుగా వుండేవి; మంత్రులు అధికార్లను చెప్పుకునిబట్టి కొట్లాలని చిట్టింక గుప్పుగావుండేవి. సీనియారిటీ జాబితాకు విలువుండేదికాదు; అధికారుల అనుగ్రహం కలిగినవారికే ఇంటర్వ్యూ పిలుపులు వచ్చేవి.

ఇప్పటి అధికారులు, తమ ఎక్స్చేంజిల కున్న ఆ పాత చెడ్డపేరు పోగొట్టాలని మనవి. సంవత్సరాలతరబడి ఎక్స్చేంజిలనే నమ్ముకున్న సీనియర్ అభ్యర్థులకు అన్యాయం చేయకూడదు. కొందరు అభ్యర్థులు, ఇతరచోట్ల ఉద్యోగాలు చేస్తూకూడా ఎక్స్చేంజిలలో తమపేర్లు అట్లనే కొనసాగిస్తున్నారు. ఇటువంటి వారిని సందర్భాన్ని లిస్టునుంచి తొలగించకుంటే, నిరుద్యోగులకు అన్యాయం జరుగుతుంది.

అల్లూరు ఎన్. లలిత్‌రెడ్డి

## నామాట

(4 వ పేజి తరువాయి)

కోలేక, నేరుగా వారి దగ్గరికేవెళ్లా! నన్ను చూడగానే ఉలిక్కిపడ్డారు. దగ్గరనుంచి తె. మం. అ. ను చూస్తే పాపం జాలేసింది. రేగిన జుట్టు, పెరిగిన గడ్డం నీరసించిన ముఖంతో టైఫాయిడ్ రోగిలా వున్నాడతను. సంగతేమిటని విచారిస్తే, చెప్పిన విషయమిదీ-

హైదరాబాదు కార్పొరేషన్ ఎన్నికల కోసం మందీమార్బలంతో తరలిరమ్మని బాబుగారినుంచి వారికివర్తమానంవచ్చిందట. వారికేకాదు, ప్రతి తెలుగుదేశం మండలాధ్యక్షులకు ఇది అందిందట. రావడమంటే అట్లా, ఇట్లా కాదు. ప్రతి మండలాధ్యక్షుడు అతమపక్షం ఇరవై మంది అనుచరులను తీసుకునిపోవాలట; వీరికి రాజధానిలో తిండి, నిద్రకు వసతి, తిరగడానికి వాహనం అన్నీ తె. మం. అ. లే. సమకూర్చాలట. దాపలు, దిండ్లు చంకనపెట్టుకుని జిల్లానుంచి దాదాపు 500 మంది పొలోమని పరుగెత్తారట; ఆ మందలో ఒకడు, ఈ తె. మం. అ.

ఇంతమాత్రానికి ఇంత ఏడుపెందుకయ్యా అంటే - మన భాగ్యనగరంలో ఎన్నికల సంగతి మీకు తెలియదాసార్, నరబలి లేనిదే ఏదీ జరగదు; అందులో మా డ్యూటీ పాతబస్తీలో అట; చీమ చిటుక్కుమంటే, కత్తులుదూసే పాతబస్తీ వాసులకు భయపడేకదా- నేను చిన్నప్పట్నుంచి ఛార్మినార్ చూడాలనే కోరికను చంపుకున్నది. అటువంటిది నన్నిప్పుడు పాతబస్తీ గల్లీల పద్మవ్యూహంలో తిరగమంటే- నే నే మై పో తా నో. తిరిగి మిమ్మల్నందరిని చూస్తానోలేదోనని దిగులుగా వుందిసార్- అని నన్ను పట్టుకుని వలవల ఏడ్చేశాడా అభాగ్యుడు.

పోకుండా వుందామంటే, రేపు టికెట్ ఎగ్గొట్టడానికి ఎగస్పార్టీ వాళ్ళు దీన్ని సాకుగా తీసుకుంటారని వారి భయమట.

పాపం, ఆ పిల్లల్ని చూసి జాలిపడడం తప్ప, మనమేమిచేయగలం! కళ్ళనీళ్ళు తుడిచి, చల్లారిన కాఫీని ఒక్కగుక్కలో త్రాగి బయటకువచ్చేసా! ★

# రైతులోకం

(4వ పేజీ తరువాయి)

ఫలితంగా పూరించుకోలేని నష్టం పొందారు.

ఈ అనుభవంతో రైతు వచ్చే సంవత్సరంనుంచి 9672 సాగుచేయకపోతే; ఈ సంవత్సరంతో ఈ రకానికి నూకలు చెల్లినట్లే పనుకోవాలి. రైతు ఒక్కోదాన్ని రకానికి విత్తోత్పత్తి చేసుకోవడానికి ప్రత్యేకంగా కారణభూతమవుతున్నది. ఇప్పటికే ఏడు మొలగొలుకురకాలకు రైతు గుడ్‌బై చెప్పారు; 9672 ఎనిమిదవది కాబోతుంది. వ్యవసాయ శాస్త్రజ్ఞులు ఒక్కో కొత్తరకాన్ని అందిస్తుంటే, రైతు ఒక్కో పాతరకాన్ని వదిలి కొత్తను చేపడుతున్నారు. ఈ పరంపరలో ప్రసిద్ధమైన ప్రశస్తమైన సన్నమొలగొలుకూడా కాలగర్భంలో కలిసిపోయింది.

అదేవిధంగానే ఐకముందు 9672 కు కూడా వస్తుస్తి చెప్పి, 9672-96 లేక 27999 రకాలను సాగుచేసుకోవలసి వుంటుంది. ఈ రెండురకాలలో రాలుడు లక్షణంలేదు; మెడవిరుపూ రాలేదు; దిగుబడికూడా మెరుగున్నట్లు తేలింది. ఈ రెండింటిలో కూడా 27999 మేలంటున్నారు శాస్త్రజ్ఞులు; రైతుల అనుభవం కూడా ఆవిధంగానే వుండాలి.

ఎనగారుకు సంబంధించి దొంగ నంబరు (కో 29) రాల పాపులర్‌రకంగా వుండేది; అది అధిక దిగుబడి ఇచ్చేది. గడ్డి ఎక్కువగానే వచ్చేది. రెండు రకాలుగా లాభదాయకంగా వుండేది. అది ఎకరాకు మూడు పుట్లు దిగుబడికూడా ఇచ్చింది; అంచనాకు మించిన పంట ఇచ్చేది కాబట్టి దానికి రైతులు దొంగ నంబరు అని పేరుకూడా పెట్టుకున్నారు! దొంగనంబరువల్ల రైతు ఆర్థిక పరిస్థితి కూడా మెరుగుపడింది. కాని పొడవురకం అయినందువల్ల పంటకోసేసరికి పూర్తిగా పడిపోయేది. పదేళ్ళక్రితం ఒకసారి విపరీతమైన వర్షాలవల్ల రైతు తీవ్రంగా నష్టపోవలసి వచ్చింది. అప్పుడప్పుడే ఐ. ఇ. టి. 2508 ప్రవేశ పెట్టబడి వుండింది; అది పొట్టిరకం; దిగుబడికూడా అధికమే. ఆ సంవత్సరం దొంగనంబరు నీటమునిగి దెబ్బతినడం, 2508 నిలబడి మంచి దిగుబడి ఇవ్వడం చూసిన రైతు దొంగనంబరుకు రద్దుం పెట్టేసి, 2508 ని స్వంతం చేసుకున్నారు. ఇప్పుడు దీనికీ పోగాలం సంభవించినట్లుంది. గత సంవత్సరం తుంగ్రోవైరస్ వల్ల 2508 వేసినరైతు మునిగిపోయాడు; అది వైరస్ ఆశించే రకమని, దానికి వీడ్కోలు చెప్పడమే మేలని వ్యవసాయ శాస్త్రజ్ఞులు సలహా ఇస్తున్నారు. దాని స్థానాన్ని 13-169, 14-44 రకాలు ఆక్రమించబోతాయి. మరో కొత్త రకం కూడా పరిశోధనా స్థానంలో ప్రయోగ దశలో వుంది. అది వాటికంటే మేలని తేలితే అదే పాతవాటన్నిటినీ వెనక్కు నెట్టి ముందు నిగలబోతుంది!

ఈ విధంగా ప్రకృతి- పరిశోధన నిరంతర పోరాటంలో జయాపజయాలతో క్రిందమీద పడుతుంటే, లాభంకంటే నష్టానికే ఎక్కువగా గురియవుతూ, అవసరం కొద్దీ మార్పుచెందుతూ, నిస్సహాయ ప్రేక్షకుడుగా నిట్టూరుస్తున్నాడు రైతు!

ఈ సంగతి పోనివ్వండి- జనవరి కుంభవృష్టికి మొలగొలుకు రైతుకు; వేరుసెనగ, పొగాకు, మిరప రైతులకు ఎంత నష్టం జరిగిందీ వ్యవసాయశాఖ అంచనాలేమైనా తయారుచేసిందా? కలెక్టరుద్వారా ప్రభుత్వానికి నివేదికేమైనా పంపిందా? ప్రభుత్వం ఏదైనా సహాయం అందించే ఆలోచనలో వుందా? ఈ ప్రశ్నలకు వెండితెరమీద సమాధానాలు చూడవలసిందే ననుకోండి; వ్యవసాయశాఖగాని, లేక మరోశాఖకు చెందిన వుద్యోగులుగాని పల్లెలకొచ్చి నష్టాలనుగూర్చి ప్రత్యక్షంగా సమాచారంసేకరించినట్లు ఏవూరి వారిని విచారించినా చెప్పడంలేదు!

—మా. వి.









## సినిమా

(11వ పేజీ తరువాయి)

రాయ్ నటించారు. మాటలు : గణేష్ పాత్రో, సంగీతం : కె. వి. మహాదేవన్.

తదుపరి భార్గవ ఆర్ట్ ప్రొడక్షన్స్ ఏడవ చిత్రానికి మార్చి 3 న పాటలరికార్డింగ్, 7 న షూటింగ్ ప్రారంభంకానున్నాయి. ఇందులో అర్జున పక్కన నూతన నాయిక పరిచయంగావింపబడుతూంది. గొల్లపూడి, వై. విజయ ఇతర పాత్రధారులు. కోడి రామకృష్ణ డైరెక్టరు.

### సిల్క్‌స్మిత సొంతచిత్రం

"నన్నొక నిర్మాత తన చిత్రంనుంచి తొలగించాడని పత్రికల్లో ప్రచారం చేశాడు. ఆయనకంటే నేనేం తక్కువని? తలచుకుంటే నేనుకూడా ఓ చిత్ర నిర్మాతను కాగలను". అంటూ సిల్క్‌స్మిత చిత్రనిర్మాణానికి పూనుకుంది, అందులో తాను నర్తకిగాకాక నటిగా పాల్గొంటూ, తన ప్రియుడు గెడ్డపు యువకుని ఆధ్వర్యంలో నిర్మిస్తూంది; ఈచిత్రంలో జ్యోతిలక్ష్మి, జయమాలిని, అనూరాధ, డిస్కో శాంతి, లలిత వగైరా సెక్స్ నర్తకీమణులందరిచేత డాన్సులు చేయిస్తుందట. సిల్క్‌స్మిత నిర్మాత అయిపోతే, ఆమెకు రావాల్సిన ఛాన్సులన్నీ తమకే వస్తాయని ఈ నర్తకీమణులు ఆశపడుతున్నారట.

### కోతికికూడా డూప్!

"శ్రీ రామబంటు" వగైరా ఎన్నో చిత్రాల్లో నటించిన లక్ష్మి అనే కోతి కాల్‌షీట్లు దొరకడం నిర్మాతలకు చాలా కష్టంగా వుంది. ఆ కోతి ఇప్పుడు "మారుతి, మీనాక్షి కుంకుమం" అనే తమిళ చిత్రం, కొన్ని తెలుగు, కన్నడ చిత్రాల్లోనూ నటిస్తోంది. ఇటీవల ఒక చిత్రం పతాక సన్నివేశానికి నటీనటులందరూ హాజరయ్యారుగాని ఆ కోతి మాత్రం రాలేకపోయింది, అంచేత, ఒక పొట్టి కుర్రాడికి కోతిలా మేకప్‌చేసి నటింపచేశారు. ఆ కోతిని పెంచే వ్యక్తి అదృష్టం బాగుంది; ఒక్కోచిత్రానికి నలభై, యాభై వేలదాకా డిమాండ్ చేస్తున్నారట.

## ఫిల్మోత్సవ్

(11వ పేజీ తరువాయి)

### తోడుకై....

స్తుంటాయి. ఒకరోజు ఆ టీచరుకు ఒక పూర్వ విద్యార్థినితో పరిచయం అవుతుంది. ఆ యువతి తన ప్రియుణ్ణికూడా పరిచయం చేస్తుంది. ఏకాంతంగా గడపడంకోసం ఆ ప్రేమికులు టీచర్ ఇంటికి వెళ్తూవుంటారు. వారి సాహచర్యం ఆమెలో కొత్త ఉత్సాహాన్ని కలిగిస్తుంది, ఆమెకు జీవితంపై మళ్ళీ ఆసక్తి కలుగుతుంది.

వృద్ధాప్యంలో మనిషి సాటి మనిషి సాన్నిహిత్యంకోసం, ఎంతగా తపన పడేదీ, ఒక పలకరింపుకోసం, ఒక మంచి మాటకోసం ఎంత కలవరించేదీ - అపర్ణాసేన్ ఈ సినిమాద్వారా చక్కని విశ్లేషణ చేశారు. ★

### చైనా స్త్రీలు

ఐని దర్శకురాలు చక్కగా చిత్రీకరించింది.

ఒక దశాబ్దం క్రింద చైనాచిత్రాలలో రాజకీయ నినాదాలు, పార్టీ నాయకుల పేర్లు వినుగుపుట్టేన్నిమార్లు వినిపించేవి. ఈ చిత్రంలో అవన్నీ అదృశ్యం అయ్యాయి. సాంస్కృతిక విప్లవం ముగిశాక, మావో మరణం తర్వాత వచ్చిన సినిమా ఇది- ఈ నూతన వాతావరణం ఈ చిత్రానికి నేపథ్యం. చైనా మధ్యతరగతి కుటుంబాల ఆశలు, నిరాశలు అన్నీ ఇందులో కన్పిస్తాయి.

-పురుషోత్తం

## ఊరు-పేరు

(4వ పేజీ తరువాయి))

దరూ ఏకమై తురుష్కుల దాడినుండి తట్టుకొనలేక పోవుచుండిరి.

అట్టి సమయంలో కాకతీయులకొలువు కూటమిలో కొన్ని దినాలు పనిచేసిన హరిహర బుక్కరాయలు. విద్యారణ్యస్వామివారి ఆదేశానుసారం విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించారు. విద్యారణ్యస్వామి వీరిదగ్గర కొన్నిరోజులు మంత్రిగావుండి తదుపరి జగద్గురు పీఠమైన శృంగేరిపీఠ మలంకరించి సిద్ధిపొందారు.

బుక్కరాయల దగ్గర విద్యారణ్యులు మాత్రమేగాక, అనంతసాగరు, మాధవ మంత్రి మొదలైనవారు మంత్రులుగా వుండిరి. అనంతసాగరుడు బుక్కరాయని కుమారుడు. ఇతడు పెనుగొండలో చక్కని కోటను నిర్మించాడు.

కనుక అనంతసాగరమనే గ్రామం చెరువువలనగాక, అనంతసాగరుడనే మంత్రిపేర ఏర్పడిన గ్రామం. దీనికి ఆధారంగా ఈ గ్రామ చెరువు నిర్మాణానికి ముందుకాలపు గుడిగుంట శాసనంలో (1409 - 10 వే, బ. 38) "ఉదయగిరి రాజ్యమందున బోయవిహార దేశం లోపలను పెన్న కటక తీరమందున అనంతసాగరానకు పడమట గుడమంటలనెడి బహదురిపురమందు....అని వుంది. కనుక అనంతసాగరం చెరువు నిర్మాణానికిముందే అనంతసాగరమనే గ్రామం పెన్నాకటకతీరాన (ఒడ్డున) వున్నట్లు అర్థమవుతున్నది.

—వావింటిపర్తి కృష్ణరావు.

సంపాదకుడు, ముద్రాపకుడు, ప్రకాశకుడు నెల్లూరు శ్రీరామమూర్తి, జమీన్‌రైతు ప్రెస్. 17/170. అప్పరాజువారి వీధి. నెల్లూరు-524001